శాస్త్రోక్తరీతిగా గాంధర్వ వివాహమాడినట్లు కనబడదు. సానిపిల్ల దొంగసరసము లాగున్నది. శకుంతల చెప్పినట్లు రాజు చెట్టుచాటున దాఁగుట యూఁకపొణకలో డాఁగి 'యిట నేల యుంటివిరా ?' యన నూఁకఁ దినుచున్నానను విటునిచందము సార్వభౌముని కేగతి పట్టెను ? "సంతాపమార్చిన లతావలయమా ? తిరిగి నినుఁ బరిభోగమునకుఁ బిల్చెద"నని యంత ప్రౌఢముగాఁ బల్కుశక్తి యదివరకే కన్నెఱికమైన సానిపాపఁదక్క మునికన్నెయ కెట్లుండును ? రాజు శకుంతల కెంత మాత్రముం దెలుపకయే తనరాజధాని కరుఁగుట కాముకస్నేహ స్వభావవిరుద్ధము. ఇష్టప్రవాసజనిత దుఃఖములు సుదుస్సహములని బ్రహ్మచారి యనుట యనుభవ విరుద్ధము. రాజు శకుంతలతో రహస్యసంభోగ మాచరించుట యొకవత్సరముదనుక కాశ్యపుఁ డెఱుఁగక శకుంతల నిండుచూలాలైన పిదప నా సంగతి తెలిసికొని యావంత యైనఁ దనతో జరిగిన వృత్తాంతముఁ దెలుపని దుష్యంతుని యొద్దకు నాకాశవాణి నమ్మి యాపెనంపెను. రేపో నేఁడో నీళ్ళాడుటకు సిద్ధముగానున్న కూఁతు నత్తవారింటి కెట్టికఠినుడైనం బంపునా ? పురాణములోఁ జెప్పినట్లాపెం బుత్రసహితంబుగాఁ బంపుట కేమి యభ్యంతరమో ! 'ఓ పువ్వుల మొక్కలారా ! మిమ్ముల నెంతయో ప్రేమతోఁ బెంచిన యీ శకుంతల యత్తవారింటి కేఁగు నాపెకు మీ సెలవొసంగుఁడీ' యనికాశ్యపునివంటి సంయమధని పిచ్చివాని వలె చెట్లతో మాట్లాడునా ? 'మలయ తటోన్మూలిత చందనలతవలె నిన్నెడసి వేఱుచో నేనెట్లు బ్రతుకఁగల' నని శకుంతల యను నుపమానము క్లిష్టము. బండియో బట్టయో చేయరాదా? నిండుచూలాలైన కూఁతుం గాలినడకఁ నంపనేల ! తనకంత ధైర్యమున్నచో రాజు నొద్దనుండి యరదమైనఁ దెప్పించరాదా ? కాశ్యపముని యంత మోటుఁదనము చేయఁదగునా ? ఒకవత్సరములోపలఁ దానెంతయో వలచి కలసిన త్రిలోకైకసౌందర్యవతి న్రాజు మఱచుటెట్లు ?

రాజొనర్చిన సాధారణకృత్యమైన సర్వలోకవిదితమాఁగదా! రాజు
శకుంతలం గవఁగూడుట యేరికిం దెలియకుండు టెట్లిట్టికథ యెంత
యసందర్భము! రాజొకసారి మాత్రమే శకుంతలం జతఁగూడె, ఇపుడు
కనుటకు సిద్ధముగ నాపె వచ్చె. ఆపెకుం గొడుకు పుట్టెనేని తక్కిన
భార్యల కనిష్టముగా వాని న్యువరాజుగా నేర్పర్చవలసియుండును.
"ఒకసారి దీనితో భ్రాంతిఁ దీర్చుకొంటి నిఁక నీ యనుమానపుతట్ట
మోయుటెందుకు? లోకులెవ్వరి కీసంగతి తెలియదు గాన నెద్దియు
నెఱుంగున ట్లూరకుంట మేలని రాజు తలంచుట యన్యాయముకదా!
కవి యిట్టికథ ప్రచురించుట లోకులకు దుర్నీతి బోధించుటగదా!
వలచినందుకుఁ బలుపుదెబ్బ లన్నట్లయ్యె శకుంతల పని! తాఁ జదువు
కొన్న టక్కరిసానిపిల్లకదా రాజుతో నుత్తరప్రత్యుత్తరములు
జరుపకుండునా? లేక మఱేవిధముగనైనఁ దన గర్భము ముదురక
మునుపు రాజసమాచారము వెల్లడిసేయకుండునా? పోనీ రాజు తన
కిచ్చిన యుంగరమైన బంధువులకుఁ జూపకుండునా? నిండుచూలాలి
రంగస్థలమున సిగ్గుఁదీసి బీభత్సంబుగ నేడ్పించు టొక నాటక
చమత్కారమా! దుర్వాసుని శాపమున రాజునకు మఱపు కలుగనీ
...కాశ్యపాది మహామునీశ్వర వాక్యము విశ్వసింపకుంటకుఁ గత
మేమి? రాజు మూర్ఖుఁడా? లేక కథకుఁ గాల్సేతులుండవా?
పెద్దలమాటలు లక్ష్యపెట్టని రాజుం గథానాయకునిఁ జేయ
రాదు. 'ఓహో తాపసి ముదుసలీ,' యనియు సార్వభౌముఁ
డగు దుష్యంతునివంటి క్షత్రియోత్తముఁడు బ్రాహ్మణ
స్త్రీలు మోసకత్తెలనియు నధిక్షేపించుట యుచితము కాదు. "నీపొల్లి
నీపె కొడుకున్నచో నీమె నేలుకొమ్ము, లేకున్న నీపెం దండ్రియొద్ద
కంపవచ్చు"నని పురోహితుండు చెప్పఁగా రాజందు కంగీకరించె.
ఓహో! ఇట్టిది నీచకులుల తలం పుత్తము లిట్టి తీర్పుచేయుదురా?
ఇసి. భారతీయోత్తమార్య చరితమునకుఁ గాళిదాసుఁ డెంత తలవంపుఁ
దెచ్చె? ఉదారమగు పూరువంశ క్షత్రియకులము కాశ్యపాది మహా

మునీశ్వర పావనచరిత్రము స్మృతిసంప్రదాయము చెప్పిచెప్పి తుదకు గొల్లలు మంగళ్ళు తీర్చు తగవువలె నిక్కవి తుస్సుమనిపించినాఁడేమి! నిండుచూలాలగు శకుంతల కనికరమెద్దియుఁ దోఁచ కనాథయై రాజ పురోహితుని యింటికేడ్చుచు నరుగుట యెగిరెగిరి యెంగిలాకు మీఁదఁ గాలువైచిన యాచారవంతునివలె సభ్యంగమొనర్చుట కత్తరువుఁ బూసికొని పేఁడతట్ట నెత్తికెత్తుకొన్నట్లింతయో సింగారమున నాటకము మొదలిడి తుదకిట్లు కరుణాబీభత్సములఁ జూపుట డెందములం గలంపఁదగదు. నాటక మిచట ముగింపఁబడవలసినదే కాని దుఃఖపర్యవసానముగాఁ బూర్వనిబంధనములంబట్టి ముగింపఁబడరాదను హేతువుచేతనో రాజునకుఁ దక్కిన భార్యలవలన సంతానము లేమిఁ దానొకసారి దొంగతనమునఁ గతికిన శకుంతల కొకవేళఁ దనపోల్కిం గొడుకొదవినచో వానికిఁ దనముదుసలితనమున రాజ్యమప్పగించఁ గోరియో - రాజు శకుంతలం దిరిగిచూడనెంచి తుదకొక వనములో నైదేండ్లపిమ్మట తన్నుఁబోలిన కొడుకుఁ గాంచిన శకుంతలం జూచి యాపెం గొడుకుతో నింటికిఁ దెచ్చుకొన్నట్లు బిఱకాయపీచువలె కథ ముగింపఁబడియె. రాజు శకుంతలం జిత్రమున వ్రాసి చూచునేమో యని భయంపడుటయుఁ దోడనే తనకు సంతానము లేదని దుఃఖపడుటయు బిచ్చికళలు కావా? శకుంతలం బెంచి యెంతయో ప్రేమించి యాపెం దుష్యంతునికడకంపిన కాశ్యపముని దుష్యంతుఁడాపె న్నిరాకరించెనని శిష్యులవలన వినియు నాపె యోగక్షేమ మరయ కూరకుంట లోకవిరుద్ధము. తనదేవి కంతగా జడిసిన రాజెట్లు శకుంతల నాపె కొడుకుతో నగరిలో నుంచుకొనునో ఈ నాటకమెంతయు నసంబద్ధముగా నున్నది. నాటకరచన మందుఁ గాళిదాసుని కంతగా శక్తి చాలదు. కాళిదాసు నాటకములకన్న నతని కావ్యములు బాగున్నవి. వానిలో రఘువంశములో మూఁడువంతులవే మిగుల శ్లాఘ్యములు. కాళిదాసుఁడు జ్యోతిషమునందు వైద్యమునందు ఛందోఽలంకార

శాస్త్రములందు దన పాండిత్యముఁ జూపుటకొఱకుఁ గొంత గ్రంథ రచనఁ గావించినట్లు ప్రసిద్ధిం జెందెను.

షేక్స్పియ రొనర్చిన "ల్యూక్రసీచెఱ" (Rope of Lucrece) యను కావ్యమందలి కవితాశక్తిం గొనియాడ వేనోళ్ళు చాలవు. దేవు డంతట వ్యాపించినట్లు షేక్స్పియరునిజ్ఞాన మఖిలమానుషానుభవముం బొదవెను. షేక్స్పియరు కనిపెట్టని మనుష్యానుభవము లేదు. సకల మానుషసంఘము న్శోధించి శోధించి తచ్చేష్టితముల న్లోకులకుఁ దేట తెల్లముగ వెల్లడించెను. కాళిదాసుని కవిత్వమందు బూర్వులు త్రొక్కని క్రొత్తమార్గ మెద్దియు లేదు. కొంతవఱకు జయదేవభవభూత్యాదులు నవీన భారతీయకవులలో స్వతంత్రులుగాఁ గాన్పించిరి. షేక్స్పియ రుఁడు స్పెన్సరుని కవిత్వము నెంతయో కొనియాడుటవల్ల షేక్స్పియ రుని కంటెఁగూడ నెక్కుడు కవు లుండియుందు రనుటకు సందియము లేదు. భారతీయ నాటకములలో మృచ్ఛకటికా, వేణీసంహారములు మిక్కిలి రమ్యములు.

రూపక ప్రయోజనము :

క్రతువిధానములు శ్రాద్ధములు, వివాహము లుత్సవ విగ్రహము లూరేగించు సంబరము, లేకాంతసేవ, లసిరమ్మ వాలకములు, పగటి వేసములు, భాగవతములు బొమ్మలాటలు మొదలగునవి జనుల కాస్తిక్యబుద్ధియు వేడ్కయుఁ గలిగించుటకై వైదికస్మార్తలౌకికకర్మము లం దనాదిగ నాటకరూపములుగ నున్నవి. నటులకు సభ్యులకుంగూడ సంకల్ప వశమున రసములు పుట్టించునది నాటకము. క్రమక్రమముగ నాగరకత ముదిరినకొలంది రూపకవిశేషములు తలచూపందొడంగె. సహజముం గనుఁగొనుటకన్నఁ గృత్రిమముం జూచుటకు మిగుల వేడ్క పడుట పామరజనస్వభావము. మఱియు నూర కగపడు కుక్కం గడు నరయుఁడు గాని పదిరూకలకైనఁ గుక్కప్రతిమం గొని యింట నుంచుకొని యవివేకి యబ్బురపడుచుండును. దేవుఁ డూహాపోహాలు

గల మనుష్యునివంటి యాకృతిఁగలవాఁడనియు, శకుంతల రవివర్మ పటమున లిఖింపబడిన యాకృతి పోల్కిదనియుఁ, గవి వన్నినట్లు మఱియు నాటకు లగపర్చిన తీరున పురాణప్రసిద్ధులు చరించిరనియు నాత్మజ్ఞానవిహీనులు భ్రమపడి వృథా వ్యయప్రయాసములకుఁ బాలగుచున్నారు. స్వప్నమునఁ దన మననెట్లు తాఁజూచు నఖిల జగద్రూప మగుచున్నదో యట్లు తన యజ్ఞానమే సమస్త ప్రపంచాకారమునఁ బరిణమించుచున్నదని తెలిసిన తత్త్వజ్ఞులకు సంసారము రుచించనట్లు వివేకులకు రంగస్థలమందలి నాటకము లింపుగా నేరవు. రుచ్యములగు పదార్థముల జిహ్వ వాంఛించునట్లు మధుర గీతముల వినుటకు శ్రోత్రములు రమ్యరూపములఁ జూచుటకు నేత్రములు న్నవరసాస్వాదన మొనర్చుటకు హృదయముఁ గోరుట నైజము. తత్తద్రసోచితాభినయం బొప్పారఁ గవిగాయక శిరోమణులగు నాది మునులు వేదపురాణేతిహాసాది శ్రవ్యకావ్యములు విన్పింపఁ బ్రాచీనులెల్లరు నంతసిల్లుచు నీతిం గ్రహించి సత్కాలక్షేపము సేయుచుందురు.

కం॥ "పట్టెడు కొప్పును, మీఁదికి
మిట్టించిన చన్నుఁగవయుఁ మిఱుమిఱు చూడ్కుల్,
నట్టాడు నడుము, తేనియ
లుట్టెడు మోవియును దొండ మూరింపంగన్"—అని

పోతన చెప్పిన పద్యముం బుస్తకములోఁ జూచినంత మాత్రమున నర్థస్ఫురణముచే నట్టి యందముఁగల స్త్రీ మనమున మూర్తీభవించును. మఱి యీ పద్యము నాట్యధర్మమునఁ జదువునెడ శ్రోతల కట్టి చేడియ కన్నులఁ గట్టినట్లుండును. అశ్వశబ్దార్థ మెఱుంగ కశ్వ మన్న నెట్లుండునో తెలియనివాని కశ్వము నగపర్చి యశ్వ మన నిట్టిదని చెప్పినప్పుడుగదా బోధపడును. అశ్వశబ్దార్థ మెఱింగినవాని కశ్వమూర్తి మనస్సునకుఁ దోఁచును. మఱియు నట్టివాఁ డశ్వము

న్యథార్థముగఁ జూచునెడ వాని కళ్వమన నేమో మఱింత స్పష్టముగు గాని వాని కళ్వమని గాడిదం జూపినచో సమాధానపడఁబోఁడు. అశ్వ శబ్దార్థ మెఱుంగనివాని కశ్వమని గాడిద నగపర్చిన నప్పటి కదే యశ్వమని నమ్ముకొనును. యథార్థముగ నేనాఁడోయున్న శకుంతల నిప్పటివారికిఁ జూప శక్యము కాదుగదా! చదువుకొన్న వారికి మాత్రము పై పద్యము చదువుటచేఁ గవి వర్ణించిన తీరున శకుంతల రూపు మనసున స్ఫురించునుఁగాని పామరుల కట్లు తోఁచనేరదు. రంగస్థలమున నొకఁడుగాని యొక తెగాని తా శకుంతలనని వాలకము వేయుట పామరుల నొప్పింపవచ్చుట. మఱియుఁ బండితులకు నవ్వు పుట్టించుట. కాని రసోత్పాదక మెట్లగును? దుష్యంతమహారాజునే నని యొక వేద ముచ్చికిరీటముం బెట్టికొని నటించుట హాస్యాస్ప దము కాదా? కాఁబట్టి నాటకరూపమునఁ జదువరులకు మఱింత వెల్లడిగఁ బదార్థములం దెలుపఁ గవులు కావ్యము లొనర్చినప్పటి కా కావ్యార్థము మఱింత ప్రచురపర్పఁగోరి తేనెకు మఱింత తీపి కలిగింపనెంచి బెల్లము కలిపిన యవివేకులవలె రంగస్థలయిన సిగ్గఱి వాలకములు వేయఁ జనదు.

కం॥ అలవాటుకాని పయ్యెద,
వెలి ముచ్చెతోడవులు, నెరవు వెట్టిన చన్నుల్
గల సిగ్గిడి, దేబె శకుం
తల యని డబ్బిచ్చి చూచు ద్రాబ యయారే!

యొక నటుండుగాని లే కొక్క నటిగాని చతుర్విధాభినయముల రంగ మున సభాసదుల నవరసంబుల రచింపవచ్చును. దుష్యంతుఁడు, రథము నకుఁ బూన్పఁబడి పర్విడు గుఱ్ఱములఁదోలు సారథి, యడివిం బరు గెత్తుచు శరపతనభయమున మెడఁ ద్రిప్పి వెనుఁజూచు లేడి, పూల మొక్కలకు నకియలతో నీర్వోయు శకుంతల మొదలగు భూమికలచే నాటకమునఁ గవివర్ణిత వస్తువులఁ బ్రత్యక్ష మొనర్పఁ గోరినచో నయ్యే

వారిం జేయఁబోయినఁ గోఁతియై యుపహాస్యాకరమగు. పోనీ, యొక వేళఁ బామరరంజనమునకై వేషము వేసినపుడే వేషమున కెవ్వ రర్హులో తెలియఁదగినది. తొంబదేండ్ల ముదుసలి వేషము నైదేండ్ల బాలుఁడు వేసిన బాగుగనుండునా? కులాంగనావేషము కులట గైకొన్నఁ దగియుండునా? నిరుపేద చక్రవర్తి ఠీవి నెట్లుగపర్చఁగలఁడు? మగవాఁ డాయారి వేసమూని పైటసర్దుకొనఁజాలునా? ఆడుది పురుష గాంభీర్య మెటుచూపఁగల్గు? గొగ్రడాలు కాన్పునొప్పు లెటు తెల్పు?

పండితపామర రంజకములుగా దృశ్యకావ్యములు కల్పింప బడియె. అవి చదువుకొని పండితులు మఱియు వానిఁబట్టి వేసిన వేష ములకుం బామరులు రంజిల్లుచున్నారలు. అజ్ఞులైనవారలు వేష ములు వేసికొని రసాభాసము చేసెదరనియో యూహించి కాఁబోలు నాట్యలక్షణ మొనర్చిన భరతమునిగాని, సంగీతకావ్యముగ రామా యణ మొనర్చిన వాల్మీకిగాని నాటకంబు లొనర్పకుండిరి. కాళిదాస ప్రహసన మొక బూతుపంచాంగము. షేక్స్పియరువలె హాస్యరస మంత మృదువుగా భారతీయ కవులెవ్వరైనం జెప్పంజాలకుండిరి.

తౌర్యత్రికము :

నాటకములందుఁ దౌర్యత్రిక మవశ్య కర్తవ్యము. చతుర్వి ధాభినయములలో లోకవ్యవహారముం దెల్పు శబ్దమాత్రముగాక కావ్య నాటకాదులుగూడ వాచికాభినయమగును. అందు కేవల వాక్యోచ్చారణము లోకధర్మి రాగయుక్త వాక్యోచ్చారణము నాట్య ధర్మి నాఁ బరఁగును. అట్లే తక్కిన యాంగికాంగహార్య సాత్త్వికాభి నయములకుఁగూడ రెండేసి ధర్మములు కలవు. సామవేదమున కుప వేదము గాంధర్వవేదము. దానికే రెండవపేరు నాట్యవేద మని. అభి నయప్రధానమగు నాట్యవేదమున వాచికాభినయమగు నాటకము నందు గీతవాద్యనృత్యము లుపయోగింపఁబడును. గీతవాద్యనృత్య ములు సహజములని కృత్రిమములని రెండువిధములు. అందు దైవ

సృష్టములు సహజములు. మనుష్య కల్పితములు కృత్రిమములు. మయూర, చాతక, చ్ఛాగ, క్రౌంచ, కోకిల, దర్దుర, గజధ్వనులు సహజములు. వాని ననుసరించి యేర్పర్చిన స రి గ మ ప ధ ని సంజ్ఞక సప్తస్వరములు కృత్రిమములు. మేఘగర్జనము, పక్షిరుతము, మృగారావము, నదీప్రవాహధ్వని, వాయునిర్ఘోషము మొదలగునవి సహజగీత విశేషములు. అందు స్వభావముగా నుదాత్తానుదాత్త స్వరిత స్వరభేదమును నవరసము లుండును. ప్రాణు లుల్లాసముగ నున్నపుడుగాని లేక తమయూహాం బరస్పరముం దెల్పంగోరినపుడుగాని లేక బాధపడునే జంతువైనం గాని ధ్వనిసేయుట సహజము. మనుష్యులు కాలక్రమమునం దమ బుద్ధివిశేషముచేం దమ ముఖధ్వనివిశేషముల నచ్చులుగ మఱియు హల్లులుగ నేర్పర్చి వానికి స్వరభేదము నిర్ణయించిరి. అట్లు నియతస్వరవిశేషలతో వర్ణ ముచ్చరించుట కృత్రిమగీతము. వేదపురాణేతిహాస కావ్యాది గద్యపద్య ప్రబంధము లన్నియు మనుష్యులు పరస్పరముం దమ యూహాల వర్ణ స్వరరూపములుగాం బ్రచురించు కృత్రిమ గీతములే. కంఠధ్వనిగాక ప్రాణుల తక్కు నవయవములచేతను మఱియు నచేతనముల కదలికచేత నొదవు శబ్దవిశేషము సహజవాద్యము. కృత్రిమగీతానుకరణముగ మనుష్యులు తతానద్ధఘనసుషిరభేదంబుగ నేర్పర్చిన శబ్దవిశేషము కృత్రిమవాద్యము. కంటి కగపడు సమస్త చేతనాచేతనాకార చలనవిశేషము సహజ నర్తనము. కృత్రిమగీత కృత్రిమవాద్యానుకరణముగ మనుష్యులు చేయు కరచరణాద్యవయవ చలనవిశేషము కృత్రిమనర్తనము. వినికివల్ల గీతవాద్యములును, జూపువలన నర్తనముం దెలియంబడుం గాన గీతవాద్యములు శ్రవ్యములు, నర్తనము చాక్షుషము. వీనులుం జూపులున్న సార్థకముగ వివేకులు సహజకృత్రిమరూపమగు తౌర్యత్రికమునుండి నవరసాస్వాదన మొనర్చెదరు.

సంగీత సాహిత్యములు :

సంగీతరస మెఱుంగని వాఁడు దుర్మార్గుఁడు. వాని న్విశ్వసింపఁ జనదని షేక్స్పియ రన్నమాట – సంగీత సాహిత్యరస మెఱుంగని వాఁడు తోఁకయుం గొమ్ములులేని పశు వను భారతీయ వాక్యము కన్న గణనీయము. మఱియు నీ సంగీత కుఠారములలో నానవేసిన గొడ్డళ్ళు, నానవేయని గొడ్డళ్ళని రెండు తెఱంగులు. సహజకృత్రిమ సంగీతములు వ్యయప్రయాసములతో వినుచుం గనుచు వెఱ్ఱియానంద మానందించుచుండియు నాఁడెము కట్టలేక నందిం బందియనియుం బంది నందియనియుం దెలిసినట్లు నటించి యభిప్రాయ మిచ్చు రసికమ్మన్యులు మొదటిమచ్చు. సంగీతమం దభిరుచియే లేనివారు రెండవరకము. లోకమందలి ముదిరిన మనుజులలోఁ బలువు రీరెండు విధములలోఁ జేరినవారే. కానిచో వారలు సంగీతము కతమున శిశువులవలె నాఁకలి మఱువరా? పశువుల తెన్నునఁ బ్రాణమిడరా? పాములరీతిఁ బరవశులుకారా? సహజసంగీతమువలెఁ గృత్రిమసంగీతము ప్రాణుల వశపర్చుకొనఁ జాలదు. కోయిలకూఁత శృంగారము, సింహగర్జితము వీరరౌద్ర భయానకంబులు. గుంపుగూడిన నానాజాతుల యార్పులు హాస్యాద్భుతంబులు; గుడ్లగూబ యఱపు బీభత్సంబునుఁ; జఱుఱాలపై జలజలఁబాఱు సెలయేటి మ్రోఁత శాంతంబు నిట్లు జగమున స్వభావ ముగఁ జేతనాచేతనములు నవరసములం దమ ధ్వనులం దెలియఁ బర్చును. గాలికిఁ గదలు వివిధస్థావరంబులు భూమిపై వాయువశమునఁ బలురూపులుగఁ దోఁచు. మబ్బులు న్మఱియు వానిలోని మెఱపులు సూర్యచంద్ర నక్షత్రకాంతులం గలుగు వివిధచ్ఛాయ లాకసంబునను సహజంబుగ నాంగికాహార్య సాత్త్వికాభినయంబు లగపర్చెడు. ఇట్లరసినకొలంది సహజసంగీత రసానుభవ మగుచుండును. కేవల వివేకులకుఁ గృత్రిమ సంగీతముకన్న సహజసంగీతమే మిక్కిలి యానంద దాయకము. ఛందస్తాలాంగ ధాతురాగ రసభాషాది నియమముచే

నిర్వ్యక్తమనియుం, దదనియమమున ననిర్వ్యక్తమనియుం బ్రబంధము ద్వివిధము. గద్యపద్యాత్మకమగు గ్రంథములన్నియుం గృత్రిమ సంగీత ప్రబంధములే. వాల్మీకి శ్రీమద్రామాయణముం గుశలవులచే గీత వాద్య నృత్యసహితముగ శ్రీరామునకు విన్పించెనని యుత్తర రామాయణము వలనఁ దెలియవచ్చెడు. ఇప్పటి కొన్ని సంగీతకుతారములు గీతగోవింద మధ్యాత్మరామాయణము మృత్యుంజయవిలాసము మొదలగు సంగీతప్రబంధములందు బాలబోధ కేర్పర్చిన రాగతాళములఁ గాంచినంతమాత్రముచేతనే యవియే సంగీతప్రబంధములనియు, వాల్మీకి రామాయణ, శాకుంతలనాటక, మనుచరిత్రాదులు సంగీత ప్రబంధములు కావనియు, రాగతాళనియమితములగు గీతగోవిందాదులకుఁ గావ్యగౌరవము లేదనియు, మఱి యట్టి యక్షగానములు పఠనార్హములు కావనియు న్వానిం గళాపాఠశాలలం జొరఁబడనీకున్నవి. నవరసము లననేమో, వృత్తిరీతు లననేమో, నాట్య మననేమో, నాటకము లననేమో, తత్ప్రయోగ మననేమో లక్షణసూత్రములం దెలిపిన భరతముని పన్నిన శాస్త్ర మెఱిఁగియెఱుఁగని సంగీతగొడ్డళ్ళు కళాపాఠశాలలం బఠనగ్రంథముల నియమించు నధికార్లుగ గ్రహచార వశమున నుంటచేతను, నేత్రహస్తవిన్యాసమూలమున నుత్తరప్రత్యుత్తరములం బత్రికల న్మాఁగపరీక్ష జరుగుటచేతనుఁ బ్రయోగప్రధానములగు శ్రవ్యదృశ్యకావ్యముల రసమంతగా బయల్పడకుండెను. సుశారీర సౌష్ఠవములుగల సుశిక్షిత నటీనటులచేఁ దౌర్యత్రికసహితముగఁ బ్రదర్శింపఁబడు కావ్యనాటకాది ప్రబంధములు సభ్యుల హృదయ రంజనముం బాత్రప్రావీణ్యము న్సూచనలు సలుపునట్లు కేవలగ్రంథావలోకన మొనర్పఁజాలదు. కాశీపురీవర్ణన గ్రంథమును జూచుటకుం, గాశీపట్టణముం బ్రత్యక్షముగఁ జూచుట కెంత భేదముండునో యనుభవశాలులకే యెఱుక. యథార్థవస్తువుం బ్రత్యక్షముగఁ బరికించినపుడు హృదయమునకుఁ గల్గు రసము తద్వర్ణన గ్రంథముం జూచినపుడుగాని లేక తద్వృత్తాంతము న్వినునపుడుగాని యటుగాక

తచ్చిత్రపటముం గన్నప్పుడుగాని కలుగునా! సమస్త వృత్తజాత్యుప జాతులను రాగతాళముల సహితముగాఁ బాడి రస ముప్పతిల శ్రోతల నానందపర్వవలయునను భరతమునిపద్ధతిం బాఠశాలల విద్యార్థులకు మప్పినయెడ జనుల నందఱు నభీష్టరసపరవశులంజేసి యభీష్ట కార్యంబుల న్నెఱవేర్చవచ్చుఁగదా! వాచికాంగికాభినయవిశేషంబుల నవరసంబుల న్స్వరభేదంబుగ నుపన్యసింపఁజాలి యొక్క విద్వాంసుఁడే వేలకొలంది జనుల న్స్వాధీనపర్చుకొని యభీష్టార్థంబు లందుచుండ, యట్టి యాపన్యాసికు లనేకులు బయలుదేఱినచో వారి సంగీత సాహిత్య రసపరవశత్వంబునఁ జొక్కిన ప్రజ వారి యిష్టానుసారముగ నెట్లు నడువకుండును! హస్తవిన్యాసమునఁ గలిగిన యక్షరములు గనుటచేఁ గలుగు రసముకన్న సుశారీరమునఁ బాడను నక్షరములు వినుటచే నాదపురసము చేతితో విసిరిన గుండుకన్న దుపాకీచేఁ బేల్పఁ బడు గుండువలెఁ గోటింతలు పనిచేయదా! రమ్మను రెండక్షరముల మాట పత్రికఁ వ్రాయఁబడగా నద్దానిం జదివికొన్నవాని కా మాట యొక్క యభిప్రాయమంతగా స్ఫురించదు. కాని ప్రత్యక్షముగా నది పల్కుచున్న యాతని హావభావములు కనిపెట్టినపుడు దాని తాత్ప ర్యము సాకల్యముగా బోధపడకమానదు. మఱియు నుచ్చారణ స్వర విశేషములంబట్టి మాటకర్థము మాఱుచుండును. గనుకనే యపస్వర మునఁ బ్రత్యవాయము కలుగునని పాణిని ముని వల్కెను. వేయేల? "కాఁకఁ బోఁగొట్టిన తీఁగెజొంపమా! తిరిగి కూటమికై పిల్చెద"నని శకుంతల యన్నమాటం బుస్తకమునఁ జదివికొన్నప్పుడు న్మఱియు శకుంతలనుండి ప్రత్యక్షముగ విన్నప్పుడుం గలుగు రసముల తారత మ్యము వేఱె తెల్పనక్కఱలేదు.

శంకరాభరణ రాగము — ఆదితాళము పామా పాము గమపమ (గామగరి గరిసా) (పైతాలము)—మరిదూ—దగా ॥ ఇట్లు వ్రాసినప్పుడు వైణికుఁడు వీణెపై స్వరమును మాత్రము కాలానుసారముగ వాయిం

చును గాని వీణెపై 'మరియాదగా' యను సాహిత్యము న్వినిపింపఁ జాలఁడు. స్వరయుక్తముగా నా యక్షరములు విన్పించుట శారీరైక సాధ్యమే. త్యాగరా జా యక్షరములం బాడిన స్వరగమకభేదము సంపూర్ణముగ వ్రాయుటకుఁగాని, వాయించుటకుఁ గాని యసాధ్యము. మఱియు నొకని శారీరమందలి యొద్దిక వేఱొకని శారీరమునకు నైజముగఁ గుదురదు గానఁ ద్యాగరా జాముక్క యన్నట్టి తీరు లనఁజాలకున్నప్పటికి నతఁడు పాడిన యీ పాట కొంతవఱ కతని శిష్యులు శారీరమునఁ బట్టఁగలరు. కవుల కవితాశక్తి కొంతయైన గ్రంథరూపమున వెలువడి శాశ్వతంబుగ జగమున వారిపేరు నిల్పుఁగాని రాల్గరఁగించు గాయకోత్తముల శారీర మాధుర్యమును జతుర్విధ వాద్యవిశారదుల వాదనచాతుర్యమును నటీనటుల నాట్యసౌందర్యమును వారలతోనే చెల్లిపోవును. ధ్వనిగ్రాహి యంత్రమున గీతవాద్యములు, రూపగ్రాహి యంత్రమున నృత్యమ్ముం జూచాయగాఁ గొంతవఱకిప్పుడు నిల్పఁబడుచున్నది గాని తౌర్యత్రికి మొక్కసారి యాకర్షింపఁజాలు యంత్రముకూడఁ బుణ్యవశమున నబ్బెనేని నృత్యగీతవాద్యముల నొక్కమొగి న్సభను రంజింపఁగల పండితుల విద్య యొక్కింతయైన శాశ్వతముగ జగంబున నిల్పుకొనవచ్చును. నాటకములోని గద్యపద్యములు రంగస్థలమున నటీనటు లెట్లుచదువవలయును? రాగతాళయుక్తముగాఁ జదువవలయునా? లేక కళాశాలలం బాఠముచెప్పు కేవల పండితులవలెఁ జదువవలయునా? ఈచదువుంగూర్చి వచనములు లోకధర్మముగఁగాని నాట్యధర్మముగఁగాని యుచ్చరింపవలయును. రసానుకూలమగు రాగలయలతోఁ బద్యములు చదువవలయును. ఉచితాభినయముగ స్వరరాగతాళములతో గీతములు పాడవలయును. లోకములో సాధారణముగా నందఱుం బరస్పరబోధకై యాడుకొను మాటలుం, జేసికొను సంజ్ఞలుం జతుర్విధాభినయములలోనే జేరుం గనుక భరతముని ప్రతిపాదించిన తీరున సమస్తజగము స్సంగీతమయమే కాన సభాసదు లెవ్విధముగా సంతోషించెదరో యా తీరున నాటక

మభినయించునది. నాటకము వాగ్గేయకారైక విరచితము కాఁదగినది కనుక యథావిధిగా మార్గివలెఁ బ్రదర్శింపరాదు. మఱేమన సర్వజన రంజన మగునట్లు యథేష్టముగాఁ బాడియాడుచు నెల్లరికి బోధపడు తీరున గద్యపద్యగీతము లుచ్చరించుచు రసానుకూలముగ నటీనటు లభినయించునది. రాగరూపకాలప్తులం బ్రౌఢుపుచ్ఛం దగదు. నాటక మవలఁబెట్టి రాగాలాపచాతుర్యముం దాళపాండిత్యము న్నృత్యవైశ ద్యము న్నాటక మాడువారు చూపరాదు. గాజుకుప్పెలోని దీప కాంతివలెఁ, బోగిచిన కూర తీరున సాహిత్యమునకు సంగీతము తోడైనచో మఱింత రుచిహెచ్చును గనుక గద్యపద్యగీతము లొక ప్పుడు మాటాడు, నట్లింకొకప్డు రాగతాళాభినయ సహితంబుంగ జన రంజనమగునట్లు యథోచిత సంగీతప్రయోగమున నుచ్చరింపవలయును. స్వరయుక్తంబుగఁ బద్యములు చదువవలయుఁగాని పద్యముల నడుమ నడుమఁ దెగబారెడు దీర్ఘములు తీయుచున్నచో శ్రోతలకుఁ బద్య సమన్వయము కాక తల వ్రులినునట్లుండును. కమ్మెచ్చునఁ దీసినట్లు రాగాభినయ సహితంబుగాఁ బద్యము ముగింపవలయు. తూఁచినట్లు పరిమితాభినయగీతవాద్యసహితంబుగా గీతము పాడవలయును. సలక్షణ సంగీత సాహిత్యములకు గుర్తు సకల పండితపామరజన హృదయ రంజనమగుటయే. నటీనటులు సౌష్ఠవసంపన్నులు, సుశారీరయుక్తులు, సుశిక్షితులుఁ, గులీనులుగ నుండవలయునని భరతముని నియమించెను. నాటకమునఁ జెప్పినం దప్ప యథేష్టముగా స్త్రీ పురుష వేషముం, బురుషుఁడు స్త్రీ వేషము ప్రసంగస్థలమునం గైకొనుట రసాభాసము. గాంధర్వవేద మనుటచే గీతవాద్యనృత్యకర్మములు నెరవేర్చుట కర్హులు బ్రాహ్మణులు కావుననే "బ్రాహ్మణోవీణా గాధినా గాయతో బ్రాహ్మణోన్యోగాయే" త్తని శ్రుతినొడవెను. మార్గపట హమును బద్మాసనస్థుఁడై వాయించునది యని భరతముని పల్కెను. "వీణా వాదన తత్త్వజ్ఞః శ్రుతిజాతి విశారదః, తాలజ్ఞశ్చ ప్రయో గేన మోక్షమార్గం నిగచ్ఛతి"—యని యాజ్ఞవల్క్యస్మృతియందుఁ

ప్రతిపాదింపఁబడెను. కనుక నెన్ని విధములఁ జూచిన న్నాట్యవేదా భ్యాసమునకు బ్రాహ్మణేతరు లనర్హులని చెప్పకతీరదు. వాగ్గేయకారునకుఁ జెప్పిన లక్షణములలో వేదాంగములైన ఛందశ్శబ్దానుశాసన జ్ఞానము లుండుటచే వేదాధ్యయ నాధికారము ద్విజైకార్హమే గాన గానకవితావిద్యాప్రయోక్తలు ద్విజులు గాని యితరులు కానేరరు. బ్రహ్మానందముకన్న నెక్కువగ నారదాదిమహామునులు గడించిన సంగీతవిద్య నలరుట కొక్క బ్రాహ్మణులే వేదపఠనపాఠనములకు వలెఁ గుత్తకొన్నారా యేమనఁగా — ఋగ్యజుస్సామాథర్వణముల యుచ్చారణమందు, మఱియు శ్రౌతకర్మములందు నుపయోగించునది వైదికసంగీత మయ్యది శ్రోత్రియాధీన మద్దానికే మార్గి యని భరత మునికృతసంకేతము. వైదికేతరజనంబుల వ్యవహరింపఁబడునది లౌకిక సంగీత మద్దానికే దేశ్య మని భరతమునికృతసంకేతము. మొదటిది యథావిధిగ నడపకున్న నదృష్టఫలము రాకపోవుటయే గాక పైపెచ్చు ప్రత్యవాయముగూడ సంభవించును. రెండవది దేశమున కెట్లింపో యట్లు యథేష్టఫలముగాఁ బ్రయోగించినప్పటికిఁ జతుర్వర్గైక సాధన మగునని భరతముని వల్కెను.

గీతాభినయములు ;

షేక్స్పియర్కాళిదాసాదికృతులు కళాపాఠశాలల న్సంగీత నిబంధనానుసారముగఁ బఠింపించుట శ్రేయము. షేక్స్పియరులోని "Come hither" అను పాటతో గ్రంథమున నొనర్చిన తెనుఁగుదరువు బిలహరిరాగ రూపకతాళములఁ బాడువిధము రెండవకాలాక్షరములు రెండతీతగ్రహముగా గీతము మొదలిడి యీ దిగువ వివరించిన తెన్నునఁ బాడునది :

* ఉద్గ్రాహము *

స స రి రి గ గ పా - గ ప (ధా ధ ప పా) పైకాలము

|| ఇవలకు రానీ - రానీ]

*ధ్రువము*

గగపధ సాససససా - సరిగరి సనినిధ ధదా

ఎవఁడు దురాశ దొఱఁగు మఱి-యొండ నుండ వలచునో

*మేలాపకము*

గగపరిరిసరిగరి సన్నిధధ - సససని దపదా పమగరి

తవిలిని తిండికై - వెదకుచుఁ - దనియు దొరుకు దానితోడ

*ఆభోగము*

సస రిరి గగ పా - పద సని దప ॥నిస॥

నివలకు రానీ - రానీ ॥మ్రొవ॥

సనిదసరిగధధపమగరి - గపమగారిగరిసా

యిచట శీతుగాడ్పుతప్ప - నెదిరివాఁడు గనఁడు.

పైనుంచిన గుర్తులలో - పైకాలముఁ దెల్పును. ఆరోహణము అవరోహణముం దెల్పును.

శాకుంతలములోని గీతము - "ఈషచ్చుంబితాని" - అందుకు దెలుఁగుపాట వసంతరాగ, చతురశ్రజాతి త్రిపుటతాళములఁ బాడు క్రమము: పైకాలపు తెండక్షరము లతీతగ్రహముఁ జేయుచు

* ఉద్గ్రాహము *

సససగామగమధామధానిరి - నిధమగనిదమగరిసరిసని

కొదమతుమ్మెద లోకింత గ్రోలు నూ - గుజడలు తుమ్మెదల

గలుగు దిరిసెపువ్వులు

*ధ్రువము*

సగగమగరిసానిధనీసామగ - ధామానిధామాగరినీసా

విదలు కలికరం బలరారం దమ - పీనుల కై సేయుచునుంద్రు

ఉద్గ్రాహ ధ్రువ మేలాపకాభోగములు గీతావయవములు. సంగీత బంధములన్నియు యథేష్టగీతనృత్యవాద్యసహితముగా ముగించవలయును. విక్రమోర్వశీయములో నాందీశ్లోకమున కొనర్చిన తెలుఁగుపద్దెము వభి

నయించు విధము* తాళధరుఁ డొకమాఱు 'తత్తాధీ' యని శబ్దముచేయు సమకాలము నందే నటి మండలస్థానకమునఁ గరముల రెండింటిం జతురస్రములుగాఁ జేసి 'పలికెద రెవ్వనిఁ బ్రాఁజదువుల కొనల' నని తన తోడిపాటకత్తెలు పాడుచుండగా నా స్వరప్రమాణముగా మొదట 'పలికెద' రను పదము యొక్క యర్థము నుద్వేష్టితకరణపూర్వకముగా ముఖమునం దూర్ధ్వముఖముగాఁ గొంచెము చాపఁబడిన హంసాస్యాఖ్యమగు నుత్తానదక్షిణ హస్తముచే నభినయింపఁదగును. అప్పుడే యెడమ చేయికూడ కటీనాభిచరముగాఁ జేయవలయు 'ఎవ్వని' యనుపదార్థము

---

మూలము :

> వేదాంతేషు యమాహు రేకపురుషం వ్యాప్య స్థితం రోదసీ
> యస్మిన్నీశ్వర ఇత్యనన్య విషయ శ్శబ్దో యథార్థాక్షరః
> అంతర్యశ్చ ముముక్షుభి ర్నియమిత ప్రాణాదిభి ర్మృగ్యతే
> స స్థాణుః స్థిరభక్తియోగసులభో నిఃశ్రేయసాయాస్తు వః॥
>
> — విక్రమోర్వశీయము

అనువాదము :

తరువోజ ॥ పలికెద రెవ్వనిఁ బ్రాఁజదువుల కొ-
నల మిన్ను మన్ను నిండ నగు నొక్కనిఁగఁ
గలుగ కొండునకు నిక్కముగ నెవ్వాని
యెడఁ జెల్లుచుండెడు నేలిక బిరుదు
నెడద నుసుఱు బిగియించి ముత్తికయి
కడఁగు వారల వెదుకంబడు నెవఁడు
కలిగించు ? బత్తిజోగమునకు సులువు
గాఁ జిక్కునట్టి ముక్కంటి మే ల్మీకు

నవరసతరంగిణి ; పుట 121

న్యావర్తితకరణ పూర్వకముగాఁ బార్శ్వగతమై యూర్ధ్వముఖ సూచీ
ముఖాఖ్యమైన యెడమచేతిచివరతో నభినయించవలయు. అపుడు
కుడిచేయు కటియందుఁగాని నాభియందుఁగాని యుండవలయును.
'ప్రాఁజదువుల' నను పదార్థ ముద్వేష్టితకరణపూర్వకముగా సవిలాస
ముగా నధోముఖమైన పరాఙ్ముఖాఖ్య నికుంచితకరములతో నభి
నయించునది. అభినయమంతటం దృష్టిహస్తానుగతముగఁ జేయవల
యును. 'కొనల' నను పదార్థము నూర్ధ్వ ముఖముగాఁ బార్శ్వగత
మగు సూచీముఖాఖ్య వామకరాగ్రతలమున నభినయించునది. 'మిన్ను
మన్ను నిండ' యనుపదార్థ ముద్వేష్టిత పూర్వకముగా నూర్ధ్వముఖ
ముగా నూర్ధ్వగతోత్తాన పతాకాఖ్య దక్షిణహస్తముతో నాకసముం
జూపి యధోముఖమై యధోగతమైన యా హస్తముచేతనే భూమిం
గన్పర్చవలయును. 'అగు' నను పదార్థము న్యావర్తితకరణ పూర్వక
ముగాఁ బార్శ్వగతమై యధోముఖమైన శిఖరాఖ్య వామకరమునఁ
దనకు సమ్ముఖతలముగా నభినయించవలయును. 'ఒక్కనిగ' నను
పదార్థముం దానేకభ్రమరికంజేసి క్రమముగా నావేష్టితోద్వేష్టిత
పూర్వకములుగా నగ్రగతమైన యూర్ధ్వముఖమైన సూచీముఖాఖ్య
దక్షిణకరాగ్రతలముచేత మఱియుఁ బార్శ్వగతమై పరాఙ్ముఖోత్తాన
పతాకాఖ్య దక్షిణహస్తముచేత నభినయించునది. 'కలుగకొండునకు'
ననుపదార్థ ముద్వేష్టితకరణ పూర్వకముగ ముత్తకటక ఖటకాము
ఖాఖ్య వామకరముతోమఱియు నాహస్తముచేతనే మఱల నుద్వేష్టిత
పూర్వకముగాఁ బార్శ్వగతోత్తాన సూచీముఖముతోడన మఱియు
నుద్వేష్టితపూర్వకముగాఁ గొంచెము పార్శ్వగతమైన పరాఙ్ము
ఖోత్తాన చతురదక్షిణహస్తముచే నభినయించునది. 'నిక్కముగఁ
జెల్లు'నను పదార్థ ముద్వేష్టితపూర్వకముగాఁ గొంచెము ముందునకు
వెళ్ళి యధోముఖోత్తానితసందశనాఖ్య దక్షిణహస్తముచేతను మఱియు
నావేష్టితపూర్వకముగా నూర్ధ్వముఖ పార్శ్వగత సందంశనాఖ్యదక్షిణ
కరముచే నభినయించునది. 'ఎవ్వానియెడ' ననుపదార్థము ఎవ్వానియను

పదార్థమునకువలె నభినయించునది. "పలిక"యను పదార్థము ద్వేష్టిత కరణ పూర్వకముగాఁ బార్శ్వగతోర్ధ్వముఖోత్తాన చతుర దక్షిణకర ముచే నాస్యప్రదేశమున నభినయించునది. 'బిరుదు' అనుపదార్థము వ్యావర్తితపూర్వకముగాఁ గర్ణరంధ్రాభిముఖ సూచీముఖాఖ్య వామ కరముచే నభినయించవలయును. 'ఎడఁద' యనుపదార్థము వ్యావర్తిత పూర్వకముగా హృదయనిహితమైనట్టియు సమ్ముఖమైనట్టియుసందంశ నామక దక్షిణకరముచే నభినయించునది. 'ఎవఁడు' అను దానికెవ్వని యను దానివలె నభినయించునది. 'ఉసుఱు' అనుదాని వ్యావర్తిత పూర్వకముగా రెండుమూఁడుసార్లు పతితోత్పతిత సమ్ముఖాగత పార్శ్వముఖస్వసమ్ముఖతల సందంశాఖ్య దక్షిణకరముచే నాసాదేశ మున నభినయించునది. 'బిగియించి' యనుదానికి వ్యావర్తితపూర్వక ముగా హృదయదేశస్థిత సమ్ముఖాగత శిఖరాఖ్యవామకరమున నభి నయించునది. 'ముత్తికై కడఁగు వారల' అనునపుడు వ్యావర్తిత పూర్వకముగా నాభీహృదయ దేశములందు మీఁదుమీఁదుగా నుంచఁబడిన యుత్తాన సందంశనద్వయమున నభియించునది. 'వెడుకం బడు' అనుదాని కుద్వేష్టితపూర్వకముగా హృదయ దేశమునందు మెల్లగాఁ ద్రిప్పఁబడినట్టి పర్మాఙుఖ పార్శ్వతల కర్తరీముఖాఖ్య దక్షిణకరమున నభినయించునది. 'ఎవఁడు' అనునది మునుపటివలె, 'కలిగించు' అనునది పరివర్తితపూర్వకముగాఁ బార్శ్వాంతర గతో త్తానిత పార్శ్వముఖపతాకాఖ్య దక్షిణకరముచే, 'బత్తి' యనునది పరివర్తితపూర్వకముగా హృదయమందుఁ జేతులుమోడ్చి పతాక ద్వయముచే 'జోగమునకు''ముత్తికై కడఁగువారల'కు వలె'నభియించ వలయుఁ గాని నాభియందెడమచేయి యుత్తానితముగాఁ బతాక రూపముగఁ జేయవలయు,'సులువుగాఁ జిక్కు' అను అనునప్డు వ్యావ ర్తిత పూర్వకముగా హృదయముఁ గూర్చి సమ్ముఖాగత పార్శ్వాగ తోత్తాన చతురాఖ్య దక్షిణకరముచేత, 'అట్టి' యనునది 'ఎవఁడు'

అనుదానికివలె నెడముచేత 'ముక్కంటి' వ్యావర్తితపూర్వకముగా శిరము నం దంజలి బంధించి పతాకద్వయముచే 'మేలు' అనునది వ్యావర్తిత పూర్వకముగానవలనముగా వ్యావర్తితపూర్వ ముఖోత్తానితారాళద్వ యముచే 'మీకు' అనునపుడు పరివర్తితపూర్వకముగ న్యగ్మైనట్టియుం బురోముఖమైనట్టియు నుత్తానితమైనట్టియుఁ బతాకాద్వయముచేత నభినయించునది. ఆవేష్టితోద్వేష్టిత వ్యావర్తితపరివర్తితములని హస్త కరణములు నాలుగు. వీని లక్షణమును, హంసాస్య సూచీముఖ పరా ఙ్ముఖ పరాకాశశిఖర ఖటకాముఖ సందంశన చతురకర్తరీ ముఖారా ళాది హస్తభేదలక్షణము నిచట గ్రంథవిస్తరభీతిచే వ్రాయఁబడలేదు. యుక్తింబట్టియు సంప్రదాయమునుబట్టియు లోకముంబట్టియు నభి నయించందగినది. లోకములో సాధారణముగా నేస్నతొండమున కెట్ల భినయించెదరో యదే తీరున లోకవృత్తానుసారముగ నభినయించ వలయు. నాట్యప్రయోగమునకు లోకమే ప్రమాణము. సాధారణ ముగా మాటాడునపుడుగాని, పాడునపుడుగాని, గొప్పయాలోచనము సేయునపుడు గాని జనులు నానావిధముగాఁ గన్బొమలు కన్నులు ముక్కు నోరు నాల్క పెదవులు మూఁతి దౌడలు కనురెప్పలు మెడ బొమ్మ భుజములు మోచేతులు చేతులు చేతివ్రేళ్ళు అడు గులు మొదలగు నవయవము లాడించుట స్వభావము సుశారీర దేహ సౌష్ఠవములు కలవా రాడినదాట, పాడనదిపాట. ఈ రెండుగుణములు లేనివారెంత శాస్త్రీయముగఁ బాడనీ యాడనీ జనరంజన మంతగాఁ గానేరదు. కాని సంప్రదాయానుసారముగ నున్నచో సుశారీరసౌష్ఠవ ములు లేకున్నం బండితైకవేద్యము కాకమానదు. 'రమ్ము' అను రెండక్షరము లుచ్చరించుచు నఱచేయి క్రిందువైపుగా బొటన వ్రేలుతక్కఁ దక్కినవ్రేళ్ళు తనకభిముఖముగాఁ బ్రసరింపజేయుట సంప్రదాయముగాని యానాల్గుఁ బైకెత్తి మండ తన కభిముఖముగు నట్లు కుడియెడమల కాడించినచో లోకరీతిచే రావద్దను నర్థమిచ్చుఁ గనుకఁ జెప్పఁబడినవాఁడు 'రమ్మను మాటనుబట్టి రాఁగలఁడా ? లేక

వద్దను నర్థమిచ్చు కరతలాభినయముఁబట్టి మానఁగలఁడా? కావున జనుఁడు లోకసంప్రదాయాభినయము ననుసరించకతీరదు. తన యభిప్రాయము న్వెల్లడించుటకై లోకుల ననుసరించి చతుర్విధాభినయ మొనర్చవలయును.అట్లు చేయనియెడల నపాయ సూచనమందుఁ బొగబండి కెఱ్ఱజెండాకుమాఱు తెల్లజెండా చూపిన చందమున వైపరీత్యమగును. సంప్రదాయమునకు వ్యతిరేకముగా గ్రంథరచనముఁగాని, యుచ్చారణముఁగాని,యాచారములుగాని మార్చినచో హాని కలుగుఁగాని లాభముకానేరదు.

సంప్రదాయము :

బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రజాతు లిదివఱకు సంప్రదాయసిద్ధముగా భరతఖండమున నాల్గుజాతు లున్నవి. వానిలో నెన్నియో భేదములు కలవు. బ్రాహ్మణజాతి పదివిధము లం, దవాంతర శాఖాభేదము లెన్నియో కల వాతీరుగానే తక్కిన జాతులుకూడ నానావిధములుగ దేశాచార భేదములఁ బట్టి విభజింపఁబడినవి. ఇపుడు సంప్రదాయసిద్ధ మతాచారములకు విరుద్ధముగాఁ బొడమిన బ్రహ్మసమాజార్యసమాజములచేత నిదివఱకే యెన్నియో కులములుగ నేర్పడి యైకమత్యముం దొఱఁగి హానిం బొందుచున్న భారతీయజనమునందు మఱింత వైషమ్యము చేటుకలుగుటతప్ప లాభ మేమివచ్చెను. శిష్టాచారానుసారులగు ద్విజులయందును శూద్రులలోఁ గొన్ని తెగలయందును ప్రౌఢవితంతువివాహముల నేర్పఱచుచున్న సంఘసంస్కార పరాయణుల యవివేకముచే నేర్పర్చబడిన ప్రౌఢవితంతుజాతి సంప్రదాయ సిద్ధజాతులకు వేఱై భారతీయులలో మఱింత హానికిం గారణ మగుచున్నది. శాస్త్రముకన్న సంప్రదాయము బలీయము. 'శిష్టాచార సంప్రదాయముతో మాకుఁ బనిలేదు. వేదములోఁ బ్వకొన్న యాచారములు సంప్రదాయ విరుద్ధము లైనప్పటికి ప్రకృతకాలానుసారముగ నవలంబించెద' మని వేదబాహుల్యము తెలిసీతెలియ కిప్పటి సంఘసంస్కరణపరాయణులు కొఱమాలిన మార్పులఁ దాము చెడి యొరు

లం జెఱుపఁజూచుచున్నారు. వీరలోనర్చు చెఱుపు నదులు సముద్ర
మునఁ గలుపు లెట్టురంగు చెత్తలవలె లోఁతు ముట్టనేరక వెలితి
యొడ్డున మాత్ర మగపడుచుండును. గరిసెడు ధాన్యములో నొకటి
రెండు తప్పుకాయ లున్న లోటేమి? వెనుకటి ఋషులు ప్రౌఢవితం
తువులకుఁ బెండ్లి మాన్పించుటకుఁ గారణ మందువలనఁ గొనసాగు
చున్న శిష్టాచారము. అందుకు విరుద్ధముగ నడిచి ములుదీసి కొయ్య
గొట్టుకొన్న ట్లీడుమలందు నవనాగరకుల దుఃస్థితి కనిపెట్టినకొలది తేట
తెల్లమగును. పురుషులకన్న స్త్రీలకుఁ-తిండి రెండురెట్లు, ఊహ నాల్గు
రెట్లు, సాహస మాఱురెట్లు, కామ మెన్మిదిరెట్లు, స్త్రీల నమ్మరాదు.
స్త్రీ స్వాతంత్ర్యమునకుఁ దగదను భారతీయవాక్యములు, మగువల
కుండును మాయమర్మము లను షేక్స్పియరుని వాక్యము, 'సాలా
వృకాని స్త్రీసఖ్యాని' యను శ్రుతియుం దార్కాణముగ నిపుడు
స్త్రీలకు రాజసభలో నధికారమిచ్చుటకు జంకు నాంగ్లదేశీయ పురు
షులే సాక్షి. సంస్కృతగర్భయగు వితంతువునకు మళ్ళి పెండ్లి సేయ
కుంటచేఁ గలుగు మేళ్ళాపెకుఁ బ్రసూతిగండముం దప్పించుట - పర
మార్థ సంపాదనమున కడ్డుదగులు సంసారభారముఁ దొలగించుట -
స్వార్థపరత లేని యామెచేఁ బుణ్యకార్యములఁ జేయించి యామెపెం
దరింపఁజేయుట - యామె మఱి సంతానము కనదు కనుక నున్నవార
లకు సమృద్ధిగా నాహారాది సుఖలాభమును మఱియు నీజన్మములో
ననుభవించు సుఖదుఃఖములకుఁ గారణము పూర్వ జన్మకృత పుణ్య
పాపములనియు, విధినియోగము దాటరాదనియు, జన్మమెత్తినఫలము
పరమార్థసంపాదనమే యనియు, నిద్రాహారములు మాత్రమే బ్రతు
కున కవసరము లనియు, నిషిద్ధరతి సౌఖ్యము దుష్టవ్యసనమనియు, నొక
నిం గవఁగూడిన తనదేహము వాని పరోక్షమున నింకొకని కర్పించుట
నీతి కాదనియు, నింకొక జన్మమందు వేదశాస్త్రసమ్మతమున గతించిన
తనపెనిమిటినిం గూడవచ్చు ననియుఁ, గామసౌఖ్యము వదలలేనిచో
భర్తలు గతించినకొలఁదిఁ బెండ్లికి వ్యవస్థయుండ దనియు, మఱియొక
జన్మమున నైనం బెనిమిటిం గలియు నాసతో క్షణభంగురమైన

యౌవనకష్టము నలక్ష్యపెట్టవచ్చు, నవియు, నెల్లవిధముల శిష్టా
చారానుసరణమే మిగుల శ్రేయ మనియుం దెలిసిన యాస్తికబుద్ధిగల
కుటుంబములయందలి సుశిక్షితలగు స్త్రీలు దుర్భరభర్తవియో
గంబు నతికష్టంబున సహించుకొనియైన గర్భాధాన సంస్కారానం
తరమున మఱల మార్మనువున కాసింపకున్నారు. శరీరమునకుఁ గలిగిన
రోగము మందుచేఁ గుదుర్చుకొని సుఖించునట్లు భర్తృవియోగ
దుఃఖము మార్మనువునఁ బోఁగొట్టుకొనరాదా యన నిశ్చయముగ
మార్మనువు పెనిమిటి తనజీవితమువఱకుం బ్రతుకునని మార్మనువాడిన
దాని కెట్లు తెలియును? భర్తలు గతించినకొలఁది యెందఱం బెండ్లాడి
బెత్తమ్మ కాఁగలదు? కోర్కెకు హద్దుగలదా? చెల్లఁగలిగిన యెన్ని
విధముల కోర్కెలు ప్రతిక్షణ ముదయించినప్పటికి మర్యాదాభంగ
మగుననియు, లేనికష్టములు తగిలించుకొనవలసి వచ్చుననియు, వివే
కులు లో నడంచుకొనుచుండలేదా? కులాగత సంప్రదాయాను
సారముగ రాజ్యమున కర్హుఁడు పెద్దకొడు కగుచుండగాఁ దక్కిన
పుత్రులు తమ కాభాగ్య మబ్బలేదని చేతులు పిసుకుకొనుచున్నారు,
వారిదుఃఖము కుటుంబసహితముగఁ దమ యన్నల యుపాయముల
వెదకి కడతేర్చినఁ దీరదా? రాజుకొడుకే రాజు కానేల? యింకొకఁడు
సింహాసమునఁ గూర్చుండనొల్లడా? కుడుచుటకుం గట్టుకొనుటకు లేక
బాధపడు పేదలకు భాగ్యవంతు లేల తమయాస్తి పంచియిారో!
తమకన్న సౌందర్యబలచాతుర్యములుగల స్త్రీపురుషుల నాలుమగ ళ్ళ
న్యోన్యమేల యనుభవించనొల్లరో! ఇంతకు శిష్టాచారము దైవనియో
గముం దప్పింపఁ బూనుకొన్న సంఘసంస్కార పరాయణుల ప్రయ
త్నము తీతువు రాయబారమువలె వ్యర్థము. మఱియు నపహాస్యాస్ప
దము. కనుక చతుర్విధాభినయము స్సంప్రదాయానుసారముగ
జేయవలయు.

ఆధునికయుగము – అస్మద్భాషాస్థితి :

ఎద్దు లేచినది, పేడవైచినది, తుప్ప తలదాసి చీపురుకట్టతో
దొడ్డి బాగుచేయుచున్నది. ముదుసలివారు పద్దోముకొంచున్నారు. ఫిరం

గులు పేలుచున్నవి, కాకు లఱచుచున్నవి, బడిపిల్లలు చలికూడు మెక్కుచున్నారు— అని యీ విధముగ స్వభావవర్ణనము చేయుటయే కవిత్వమ్మఖ్య మనువారును-'నాకు పాటలూ ఆటలూ అంటే తలనొప్పి, చూసేరూ, భోగంమేళము చూడకూడ దన్నవాళ్ళలో నేనొఖణ్ణిగా, విధిలేక వచ్చింది రాజుగారి బలవంతంపై దిక్కుమాల్ని నౌఖరీ గాని గుల్బీజానీచేత కౌను క్లబ్బు రీడింగురూములో పాడించి దాని కైదు వందలు చందా వేయించి తక్షణం జమచేయించి, "యస్ దేరీజ్ నో అదర్గో" యిచ్చే సర్కి నా అవస్థ అట్లివ్వక తీరిందికాదు, సాయెబూ! బండికట్టు. నీకు బుద్ధుందా చెప్పేకానూ స్టుపిడ్ పో రేట్లేసమన్కు వెళ్ళి వీరేశలింగం పంతులుగారు వస్తారు, వార్నితీస్కురా. ఏం పాటలు! ఆడవాళ్ళంటే కొంత వినవచ్చు కాని సంగీతపాటకులంటే నాకొళ్ళుమంట. వాళ్ళ వికారాలు వాళ్ళ రుంజుకోవటాలు ఎడ్యుకేషకా? వాళ్ళకు స్టేటస్లేదు. ఇంగ్లీషు ఎడ్యుకేషను లేనివాఁడికి సివిల్జేష నేముంటుందండీ? సంగీతం అంటె నాకసయ్యంగాని మా అమ్మాయిలకు కుమారసంభవం చెప్పిస్తూన్నాను. డెబ్బయియేళ్ళ శాస్త్రుల్లుగారు బాగాచెప్తాడు. అబ్బా! చూశారా, గ్రామ్యం ఎందుకు రాయకూడదు? నల్గురికి తెల్యాలా? ఐటెల్యూ మిస్టర్, గణాలు ప్రాసలు వీటికై వ్యర్థపదాలు దోపి మీనింగ్ పాడుచేస్తూవున్నారు. దీని రస్సావలవా, ఆ ఏంవి చేయాలండీ? ఆర్బతునాటు కంపెనీలో పోయినాయండీ పన్నెండువేల రూపాయిలకు పైగా. గాడ్సువిల్! గ్రామ్యభాషతో అనగా మనవంటి కొంచెము సివిలైజుడుమెన్ మాట్లాడే భాషతో కావ్యాలు వ్రాస్తే ఫెల్లో ఆఫ్ యూనివర్సిటీనిగా వర్నాక్యులర్ బ్రాంచికి ఆ పుస్తకాలు స్కూళ్ళకు పెట్టించుటకు ట్రై చేస్తాను. ఆ సబ్జక్టుమీది. ప్రౌఢరజస్వలానంతర వివాహసబ్జక్టు మహా మహోపాధ్యాయులగారిది. డామ్ యువర్బెస్టు, ఓ థేంక్యూ' ఇట్లు తగుమనుష్యు లాడుకొను భాషం గ్రంథములు వ్రాయవచ్చు ననియు

నాంగ్లేయభాషాపాండిత్యము కొంతఁ గలిగియున్న మాత్రమున గీర్వాణాంధ్రభాషలుగూడఁ గూలంకషముగఁ దెలిసినట్లు వేషములువేసి, తమకు పాండిత్యముం బజీతుసేయు బజారుపత్రికల స్వీధిఁబెట్టుచు సభల సిగ్గఱి సొఱకాయలు తెగనఱుకు నాంధ్రులును - మఱియుఁ బుస్తకములఁబట్టి కొన్ని తెలుఁగుమాటలు వల్లించుకొని తెలుఁగన్న నేమో తెలియని యాంగ్లేయులవద్ద నాంధ్రభాషాపండితులమని నటించుచు నాంధ్రభాషా పరీక్షకులైన యఱవలునుం - తెనుంగుబాస యుసుఱు పోసికొనుచున్నారు. శాకుంతలనాటకము విద్యార్థులకుఁ బాఠముచెప్పఁగల గైర్వాణపండితునకు నెలకుఁ బదైదురూప్యములు మాత్రమే వేతనముగాని హేమ్లెట్టు పాఠముచెప్పు నాంగ్లేయభాషా పండితునకై దువందలు రూప్యములు నెలకు వేతనముకదా! ఆంగ్లేయ భాష రాజభాష యగుట చేతఁగదా యంతజీత మీయఁబడుచున్నది. కేవల గీర్వాణాంధ్రభాషాపండితుల నిప్పటి చెడుకాలములో నెవరు చూచెదరు? వేదశాస్త్రములు సంగీతసాహిత్యరసజ్ఞతయు నడుగంటినవి. మానవ ధర్మశాస్త్రము సంస్కృతమునఁ జదివికొన్నవానికి దమ్మిడియైన రాబడిలేదుకాని యదే యాంగ్లేయభాషలోఁ జదివికొని పరీక్షలో నెగ్గినవాఁడు న్యాయాధికారియొద్ద వాదించుట కర్హతకల్గి నెలకు వేలకొలఁది సంపాదించుచున్నాడు. కావుననే కొంపగోడి యమ్ముకొనియైన నాంగ్లభాష భారతీయులు నేర్చుకొనుచుఁ దమ భాషల నిరసించుచున్నారు. తుద కాంగ్లేయభాషలో భగవద్గీతలఁ గూర్చి యుపన్యాస మిడు నేనిబెసంటమ్మగారి పాదములఁ బట్టుచు సంస్కృతమున భగవద్గీతలు బోధించు నాచార్యులంగూడ సరకుసేయకున్నారు. భరతవర్ష పరిపాలకులు భరతవర్షమునందు భారతీయ భాషలనే యుపయోగించి పాలించునెడ భారతీయభాష లన్నియు సమున్నతదశ నందుఁగదా!

కళలు - కవిత్వము :

సంగీతవిద్వాంసులమని బయలుదేఱినవారిలో నూటికిఁ దొంబది తొంబండ్రకుఁ బైగా శ్రుతిలయజ్ఞానములు స్ఫుటముగా నుండబోవు. కవిత్వము సంగీతము సహజముగాఁ బుట్టవలయుఁగాని శక్తిహీను లెంత నేర్చుకొని యంటించుకొన్నను లాభము లేదు. వేనవేలు భాషా పరీక్షయందు నెఱవేరినవారు కలరు గాని సొగసుగా గద్యపద్య ప్రబంధముల స్వతంత్రముగఁ గల్పించి కవితాప్రతిభఁ జూపఁగల కవీశ్వరు లొకరిద్దరైన దేశమంతటం దేలుట కష్టము. కూనిదీర్ఘరములు దీసి గద్యపద్యములు చదువువారు లక్షలకొలందిగలరు. కాని శారీరసౌష్ఠవయుతులై సభలం దౌర్యత్రికమున వేలకొలంది పండిత పామరుల రంజింపఁజేయువా రొకరిద్దరు జగమున నుంట కడునరుదు. లోకములో సార్వలౌకికులు నాఁబరఁగు కవులు షేక్స్పియర్కాళి దాసులే కదా! కవీశ్వరుల కవితాప్రతిభ వారిగ్రంథములు వెల్లడించును. మఱియు నొకభాషలోని గ్రంథ మింకొక భాష లోని కర్థము పోని కించుమించుగ మార్చవచ్చుఁగాన సకలదేశముల జనులకు భూత వర్తమానకాలములం బరఁగు కవీశ్వరుల శక్తి లోకమంతట దెలియఁ బడుఁ గాని యొకని తౌర్యత్రికచాతుర్య మింకొకనికిఁ బరోక్షమున నొక్కమొగిఁ దెల్పఁజాలు యంత్రములిదివఱకును లేవుకదా! ఈశ్వరానుగ్రహమున నిఁక గనుఁగొనఁబడినప్పటికి నట్టి యంత్రము లభింపకముందున్న సంగీతపండితులు పెక్కండ్రు జగద్విశ్రాంతకీర్తిఁ బడయనేరరుకదా! షేక్స్పియర్కాళిదాసుల కావ్యములకన్న సొగసైన కావ్యములెన్ని వ్రాఁత లోకులకుఁ దెలియని కాలమున ఖిలములై పోయెనో దేవుని కెఱుక! వాచికాభినయరూపమగు కావ్యమునకు గీతవాద్యములకన్నను మఱియు నాంగికాహార్య సాత్త్వికాభినయముల కన్నను గౌరవమంతగా వచ్చుటకుఁ గారణము స్వరసందర్భముం జతుర్విధవాద్యము న్మఱియు నృత్యముం గ్రమముగ గాయకుని శారీర సంపదయు, వాదకుని కరగుణము, నటుని నృత్యవిశేషము, న్వెండియు నా మువ్వురి విద్యావైశద్యము సభకుఁ గన్పర్చుఁగాని కావ్యము సకలజగము నద్దమువలెఁ జూపుటయేగాక మానవులకు

వివిధావస్థలయందుఁ దలంపు లెట్లుండునో వానింగూడ బయల్పెట్టును. సర్వరూపము లాకర్షించుటకు రూపగ్రాహియంత్రమును, సకల ధ్వనుల నాకర్షించుటకు శబ్దగ్రాహియంత్రమునుం గలవుకాని నానావస్థలయందు బయల్పడని మనుష్యుల తలంపులంగూడఁ దెలుపుటకుఁ గావ్యముకన్న వేఱు యంత్ర మిదివఱకు లేదిఁకనుండఁబోదు. కవితాశక్తింగదా జగమున నెల్లకృత్యములు ప్రబలుచున్నది! కవిత్వము ప్రత్యక్షముం దెలుపుటయేగాక పరోక్షముంగూడ బయటపెట్టుం గావుననే "కోవేత్తి కవితాతత్త్వం శివో జానాతి వా నవా" యని కాళిదాసుఁడును, "నతచ్ఛాస్త్రం నసావిద్యా నతచ్ఛిల్పం నసాకలా నాసా యోగో నతత్కర్మ నాట్యేస్మి న్నవీక్షతే" — యని భరతమునియు వక్కాణించిరి. కవిత్వమనఁగాఁ గావ్యముఁ బన్ను నూహ. కవిత్వము సహజ కృత్రిమము లని రెండు విధములు. పాంచభౌతికక్రియలు కల్పించునది సహజము. ఘటపటాది లౌకికకృత్యము లొనర్చునది కృత్రిమము. కావునలోకమునఁ గల్గు సకలక్రియలును దైవికమానుష సంకల్పవశముననే కలుగుచున్నవి. షేక్స్పియర్కాళిదాసు లంత కష్టపడి యాఁకలి నిదురలైన మఱచి సమస్తైహికభోగముల మానుకొని రాత్రింబవళ్ళేకదీక్షతోఁ గావ్యము లెందుకు వ్రాసినారు? కీర్తికొఱకా? ఎవఁడైనఁ జెల్లిపోయినవెనుక వానిం బైవారు దూషింతురో లేక భూషింతురో కనిపెట్టలేఁడుకదా! ధనమునకా? ఎంతో సులువుగా మఱికొన్ని పనులవల్ల ధనము కావలసినంత లభించుఁగదా! భోగమునకా! లోకజ్ఞానమే లేక తనువు మఱచి తదేకధ్యానముతోఁ గోరిన పదమొకటి తోఁచనపుడు కొంపపోయినట్లు విచారించుచు, నొక సందర్భము కుదుర్చుకొనుట కెంతయో గింజుకొని తన్నుకొనుచు, నెంచుకొన్న శబ్దము స్ఫురించినపుడు రాజ్యముదొరికినట్లు సంతసిల్లుచు సంతత మెద్దియో యాలోచనమున మునిగియున్నవాఁడు స్రక్చందనవనితాది భోగము లనుభవించు టెట్లు? మోక్షమునకా! శకుంతల పిఱుందల, న్వేళ్ళమేటు వెఱ్ఱియందుం దగులుకొన్నవారికి నిర్విషయ మన స్సెట్లుకుదురును? పరోపకారమునకా? శాకుంతలము న్వేళ్ళమెట్టుం జదువకున్న ప్రాణుల కాఁకలి తీఱదా లేక నిదురపట్టదా? నీతిఁ

తెల్పుటకా? మంచిచెడ్డలు బాగుగఁ బరిశీలింపక పాత్రురహస్యముగాఁ
జేయరా, దెదుటివారల మనసు కనిపెట్టకచేసిన పొందు దుష్యంతు
నేకాంతముగఁ గలసిన శకుంతలకువలె వికటించును; మఱియుఁ బరునిఁ
జంపి వాని సొత్తాక్రమించుకొనరా, దట్లొనర్చిన వాడు హేమ్లెట్టు
పినతండ్రివలెఁ బొలియింపఁబడునని - శాకుంతలమందు, హేమ్లెట్టు
నందుఁ దెలుపఁబడిన యీరెండునీతుల శ్లోకములో నెఱుఁగని వారె
వరు? క్రొత్తవాని నమ్మికొని వాని ప్రహస్యముగఁ బెండ్లాడి వాని
వెంబడిఁ బోవ కామర్మ మెవ్వరికైనం దెలియనీక మిండతవలె నీడు
వచ్చిన కన్యక యెవర్తె యుండును? మఱియుఁ దానన్యాయముగ నొరుని
గొట్టినం దనపైఁ బరులు పగపట్టెదరని పిచ్చివానికిఁ దక్క నితరులకుఁ
దెలియదా? లోకులందఱికిం దేఁటతెల్లమగు నిట్టి నీతులకై కొండం
ద్రవ్వి యెలుకం బట్టినట్లు కవీశ్వరులు వృథాప్రయాసమున నంతలేసి
గ్రంథముల రచింపనేల? సమస్త జగత్కారణమగు శక్తి యెద్దియో
వాగ్గేయకారాది కవిరూపమున నూహించుచు వ్రాయుచుం బాడుచు
నాడుచు వాయించుచు సకలకర్మముల నాచరించుచు, వేయేల, సర్వ
జగద్రూపమై సత్త్వరజస్తమో గుణములం దనలోఁ దా నాటాడు
కొనుచుండును. అందులకే కారణ మూహింప మానవుల కలవికాదు.

నరుల ఊహాపోహములు :

జ్యోతిష్కులు గురుశుక్రయోగంబున నిట్టి వింతలు లోకంబున
జరుగవచ్చుననియు - డెబ్బది పదునొకండు కోట్ల నలువది పన్నెండు
లక్షల, తొంబది పదుమూఁడు వేల, రెండ్నప్పాతిక యోజనముల
దూరమున భూగోళమునుండి శుక్రమండల మున్నదనియు -నందులోఁ
గాల్వ లగపడుచున్నట్లున్నవి కనుక తప్పక మనుష్యులు నుందురేమో
యనియుం-గోఁతలు గోయు గణితశాస్త్రజ్ఞులు భూమి యైదువేల
మైళ్ళు చిల్లర యించుమించు దళసరిగనున్న దా నడుమ నగ్గినీరున్నది
నామాట నమ్మఁబోవనిచో నచటికిఁ బోయిచూడుఁడు మీకే బోధ
పడుననియు - చరిత్రకారులు పోల్చిచూడఁగా నాంధ్రాంగ్లేయ శబ్ద
ములు ప్రథమాక్షర సంబంధముఁబట్టియు నుభయభాషలలో నీటు,
ఈను శబ్దములు సమానరూపార్థముల నంట చేతను, మఱియు అబ్బ,

ఆము శబ్దముల సమాన రూపార్థములం బట్టి మఱికొన్ని కారణముల వల్ల నాంధ్రాంగ్లేయులుగాని యాంధ్ర తురుష్కులుగాని శాలివాహన శకమునకు ముందు మూఁడులక్షల మాసముల పన్నెండు దినములు దాదాపుగా బహుశా ఒక్క కులములోనివారై హిమాలయము డెప్పె నడిమిలో నుండియుండవచ్చు ననియు - పరిణామవాదులు వానర నరశబ్దముల సంత్యాక్షరములు సమానము లగుటచేతను మఱియు నుభయజాతుల చేష్ట లించుమించు నొక్కలాగుంటచేతను వానరజాతినుండి నరజాతి రూఢిగఁ బుట్టియుండవచ్చు ననియు- నిట్లు వివిధ శాస్త్రజ్ఞులు జాత్యంధు లేనుగుం బోల్చిన ట్లూహించుచుం దురు. దైవమాయననుమానమున నెఱుంగ నేరితరము? మిడతంభొట్లు శకునమువలెఁ గొందఱి యూహలు గుఱికిబెత్తె డగుచుండును. మొత్తముపై మానవులు తెలిసీతెలియనివా రనుట కే సందియములేదు.

మహాకవుల సందేశము :

మఱియు మదాతిశయంబునలేని వస్తువులు నిజముగఁ గాన్పించునట్లు నజ్ఞానదశయందు స్వప్నావస్థయందుఁబోలి తనకంటె నన్యమెఱుంగని నిత్యముక్త శుద్ధబుద్ధస్వరూపుఁడగు జీవున కాత్మరూపకమగు జగత్తు తోఁచుచుండును. కాని వైరాగ్యము లేక ప్రజ్ఞానదశయందు మదముడిగినపిదప న్మఱియు నిదురమేల్కొన్న పిమ్మట న్వికారము లగపడన ట్లీలోకవిచిత్రము కాన్పించకుండును.సచ్చిదానందస్వరూపుఁడగు పరమాత్ముఁ డొకఁడె మిగులుననుచుఁగాని,మఱియు సముద్రపు టొడ్డునఁ బలుతెఱంగుల నిసుక గాలిచే రూపించుతీరున మనుష్యులు పరవశులై దైవవశంబున వివిధస్థితుల మారుచున్నా రనుచుఁగాని, 'కర్తా భోక్తా జనార్దన' యనుచుఁగాని, యాప్తవాక్యము తెలిసికొనువారు సంసారదుఃఖము నంటరను వేదాంతముం గాళీదాసకృతుల బోధించుచున్నది. షేక్స్పియరుని కృతులవలన సంసారము 'దుఃఖభూయిష్ఠము' మానవులది యనుభవించకతీఱదు, పాపాచరణమున నిత్యనరకముం బుణ్యమున నిత్యానంద పదవియుం జీవులకుఁ బరమాత్మునిచే నొసంగఁబడునని బోధపడుచున్నది.

సత్కావ్యలక్షణము :

కావ్య మననేమో యనేకు లనేకవిధములం బ్రాచీనాలంకారి
కులు తెల్పిరి. అం దిష్టార్థోపేత మగు పదావలి కావ్య మను దండి
వచనమే మేలు. ఏమనఁ బ్రతిశబ్దమున కెద్దియో యర్థము లేకపోలే దా
యర్థబోధమున నెద్దియో రస ముప్పతిలకమానదు. గుణదోషాలంకార
ములు వివక్షామూలములు. ఒకప్పుడు గుణము దోషముగను, దోషము
గుణముగను, నలంకారము హేయముగను మాఱెడును. అన్న మజీర్ణ
మున విషమగు, విష మొకప్పుడు పథ్యమగు. శవాలంకార మసహ్య
మగును. మనసున కింపగు శబ్దార్థములు కావ్య మనఁదగును. భరత
ముని చెప్పిన విభావానుభావ వ్యభిచారి సంయోగమునఁ గల్గు
తొమ్మిదిరసములలో నుత్తమజనులం గాన్పించు వీరశాంతకరుణలు
సత్త్వగుణప్రధానములు. మఱియు నధమజనులందోఁచు రౌద్రబీభత్స
భయానకములు తమోగుణప్రధానములు. ప్రతి వస్తువునం దెద్దియో
రసము ప్రధానముగను మఱియుఁ దక్కిన రసముల ప్రధానముగ నుం
డకతీఱదు. చక్కెరయందు మధురరసము ముఖ్యముగఁ దోఁచు, నుప్పు
మొదలగు చవు లడంగియుండును. జనుల కేశబ్దార్థసమూహము వలన
మనసుల కుల్లాసము కలిగి సత్కార్యాచరణమున కుత్సాహముపుట్టునో
యట్టిది సత్కావ్యము. జనులకు భయశోకజగుప్సాక్రోధములం బుట్టించి
దుర్మార్గమునకుఁ బురికొల్పునది యసత్కావ్యము. మద్యమాంసా
శనులై పరదారధనమ్ము లపహరించుచు మోసంబున యథేష్టంబుగఁ
జరించు దుర్మార్గుల సుఖస్థితి వర్ణించుట లోకులం దుర్మార్గమునకు
రేఁపకమానదు. లక్షణవిహీనముగ యథేష్టముగ వ్రాయఁబడిన
పుస్తకములు కళాశాలలం బాలురకు నుప్పుట. వేశ్యాకన్యల నిల్లాం
డ్రఁగా నుంచుకొనుట. ఇల్లాండ్రు యథేచ్ఛ సంచరించునప్డు చూచీ
చూడనట్లు నోరెత్తకుండుట, వర్ణనియమము మాని యన్నిజాతులు
కలసి తినుచుం బరస్పరవివాహము లాచరించుకొనుటయే యవశ్య
కర్తవ్యమనుట, స్త్రీపురుషులు పెండ్లి మాని వావివరుసలు లేక
యథేష్టవిహారము సల్పినచో నెన్నియో దుఃఖములు తొలఁగి జనులు
బాగుపడెదరనియు యుపన్యసించుట, పరలోకము లేదని రూఢిగనమ్మి

సుఖపడుటకొఱ కెట్టి దుష్కార్యమైనఁ జేయుట, తాఁజెడుటయే కాక పరులంగూడఁ జెఱుపఁబూనుట, ధనార్జనముకై యెట్టి నీచకార్యము లైన నొనర్చుట, పూర్వాచారముల న్వెక్కిరించుట, కల్లుద్రావుట, మాంసము తినుటయు, నిప్పటి నవనాగరకులలో బుట్టుచున్న తెవుళ్లు. స్వదేశోద్ధారణమునకై పాటుపడుచున్నట్లు కన్పట్టుచుఁ దగు మను ష్యులవలెఁ బైకిఁ గాన్పించుచుఁ, బ్రభుసన్మానము వడయుటకై తోటివారి నెంతో హింసించుచుఁ, దాఁబట్టిన కుందేటికి మూఁడే కాళ్ళని మొండివాద మొనరించుచుం, బ్రాచీనమతము నిరసించుచుఁ, బాశ్చాత్యాచారముల నర్చించుచు, నాగరకాగ్రణ్యులమని విఱ్ఱవీఁగు చు మానమర్యాదలు లేక గెదెపెయ్యయు నాఁబెయ్యయుఁగాక దిక్కు మాలిన పెయ్యయై నవీన భారతీయజనము కలివశంబున నవశంబై యుభయలోకభ్రష్ట మగుచున్నది. ఇపుడు భారతీయ ప్రజయం దే రసముఁ గాన్పించుట లేదుగాని నీరసము మాత్రమగపడుచున్నది. తన లోని కోర్కె పరులకుఁ దెల్పుటకుఁ జతుర్విధాభినయంబు లుప యోగింపఁబడుచున్నవికదా ! అవి సమయోచితములై సరసములుగా నుండవలయును. ఇజ్జగన్నాట్యరంగమున మానవులు యథోచితముగ నటించనియెడ వైపరీత్యమున రసాభాసముగ నగుబాటుం బ్రజాపీడయు నగును. జనులందు మహారాజు బట్టమెడఁకుజుట్టికొని దీనదృష్టితోఁ జేతులు జోడించి సాష్టాంగపడి 'క్షౌరము చేయుటకు విచ్చేయఁ బ్రార్థించెద'నని మంగలిం బిలుచుట, కాల్వలూడ్చు చచ్చుడివాఁ డాకస్మికముగా శిఖాయజ్ఞోపవీతముల ధరించి స్నానమొనరించి శ్రోత్రియవేషముతో 'శ్రాద్ధ మొనరించెద, బ్రాహ్మణార్థమునకై రం'డని వైదికులం బిల్చుటయు, డెబ్బదేండ్లవాఁడు పిన్నవయసు వానివలె నెనిమిదేండ్ల కన్నెకుఁ బుస్తెకట్టుటయు,బోడ తెంపి తలపెంచు కొని పసుపుబొట్టు కాటుక లుంచుకొని కాళ్ళపారాణితో ముత్తైదులం బిల్వనేఁగుట, బ్రాహ్మణుఁడు సేవకావృత్తిఁ జేయుట, కుక్క నందల మున నిడి యూరేఁగించుట, న్యాయాధికారి లంచగొండి యగుట, నూత్న మానవనసన్నిపాతుఁడు ధర్మాధికారి యగుట, ప్రభువు విద్యా హీనుఁ డౌట, కూటికై వేదాంతము చెప్పుట, బండబూతు ప్రహసన

లం బ్రచురించుట, తద్దినము మ్లేచ్ఛభాషతో జరుపుట, బాలుం డుపన్యసించుట, క్షత్రియుఁడు ముష్టెత్తుకొనుట, యవిద్వాంసుఁడు సభాధ్యక్షుఁ డౌట, మగనాలు లంజవేసమున నగపడుట మొదలగు సంప్రదాయ విరుద్ధవేషము లూనరాదు. శృంగారమున విధ్యుక్తముగాఁ బెండ్లాడిన యాఁపెతోఁ విహరించుటయు, హాస్యమున-సూనృతవ్రతుఁ డన్యులచేఁ గల్లబోతని యపహసింపబడునెడ మందస్మితము చేయుటయు, వీరమున సాధుసంరక్షణకై ధర్మయుద్ధమున నసుఱుఁ గోల్పోవుటయుఁ, గరుణయం - దాపద నున్న సజ్జనులం గాంచి కంట నీరిడుటయు, రౌద్రమున - సజ్జనాపకార మొనర్చు దుర్జనులం గని బొమముడిపాటుఁ గావించుటయు, భయానకమున - దుష్టసంపర్కము నకు వెఱచుటయు, బీభత్సంబున - సజ్జనోపద్రవముఁ గనుఁగొని మూర్ఛిల్లుటయు, శాంతంబున - సప్తవ్యసనముల కోరసిల్లుటయు నుత్తమస్థితులనఁబడు. ఇట్లు నవరసంబు లగపఱచు సజ్జనుల నడువడి న్వర్ణించు నిరుపదిష్టశబ్దార్థసమూహము సత్కావ్యంబు నాఁబరఁగు. అట్టి సత్కావ్యంబు లొనర్చువారు సుకవులు. షేక్స్పియరుని కృతులందు 'నీయిష్టానుసార' మను (As you Like It) నాటకమునుఁ 'గొరియలేనస్సను' (Coriolanus) నాటకమును సత్కావ్యములు. కాళిదాసకృతులందు రఘువంశ, కుమారసంభవ, మేఘసందేశములు సత్కావ్యములు. రఘువంశ, కుమారసంభవ, మేఘసందేశము లొనర్చిన కాళిదాసు వేఱు - నాటకత్రయమును, శృంగారతిలకర్తుసంహారములఁ జేసిన కాళిదాసుఁడు వేఱు - తక్కినవి చేసినవాఁడు వేఱని నాకుఁ దోఁచెడును. మూఁడువేల యేండ్లక్రిందట రఘువంశ, కుమారసంభవ, మేఘసందేశము లొనర్చిన కాళిదాసుఁడు పరమభాగవతుఁడై బమ్మెరపోతనామాత్యునివలె స్వతంత్రుఁడై యుండవచ్చు! ఈతఁడే జగత్ప్రసిద్ధిఁగొన్న కాళిదాసుఁడు. కానిచో నట్టి సత్కావ్యప్రవృత్తి యతనినుండి కానేరదు. నాటకత్రయము శృంగారతిలకర్తుసంహారము

లం జేసిన యతఁడు పదాఱువందల యేండ్లకు ముందుగాఁ గృష్ణదేవ రాయాస్థానకవియగు పెద్దనామాత్యునివలె భోజమహారాజాస్థాన విద్వాంసుఁడై రాజప్రీతికై నాగరశృంగారప్రధాన కావ్యంబు లొనర్చెననవచ్చును. మిగిలినవాఁ డెవఁడో వేయేండ్లక్రిందఁట గొండ రాజుల యొద్ద బండబూతులాడు మొండిపండితుండు కావచ్చును. కాళిదాసుని పేర బయల్వడు ప్రహసనము ముద్రింపఁబడి ప్రచురింపఁ బడుట భారతీయగౌరవమున కెంతయో లోపము. రఘువంశమున శ్రీరామచరిత్రాంతమువఱకునుం, గుమారసంభవమున మొదటియేని మిది సర్గలును, బూర్వమేఘము – నుత్తరమేఘమున గొంతయు నొ్మదటి కాళిదాసుకవిత్వము. తక్కిన భాగము లల్పకవి విరచితములు. కాళిదాస కావ్యములలో రఘువంశమునందు శ్రీరామచరిత్రాంతము వఱకుఁగల భాగము, నాటకములలో విక్రమోర్వశీయమును, షేక్స్పియరుని నాటకములలో 'నీయిష్టానుసారముం' గావ్యంబుల 'ల్యూక్రసీ చెఱయు' నిరుపమాన కవితాప్రతిభ కాటపట్టులు. కాళీదాసవిరచిత రఘువంశము వంటి సొగసైన కావ్యము జగమున కరుదు గావున లోకములోని యెల్లనాగరికులు తమభాషల కద్దాని మార్చుకొనుట శ్రేయము.

రసపోషణ సామ్యములు :

నవరసము లొండొంటఁ గలియక కేవల మొకటిగా దేని మట్టున కది నిలువనేరదు . కావున నీగ్రంథమున నొక రసమునకు మారుగ నింకొక రసమున సొగసు లందందఁ గూర్చఁబడియుండ వచ్చును. షేక్స్పియర్కాళిదాసుల యూహా యించుమించు సరి పోవుట.

# నవరస తరంగిణి

OR

BEAUTIES OF SHAKESPEARE

AND

KALIDAS

## HONOUR

**ALL IS WELL THAT ENDS WELL.** *Act. III. Sc. V.*

The honour of a maid is her name and no legacy is so rich as honesty. 1

*Act. V. Sc. iii*

Let's take the instant by the forward top,
For we are old, and on our quick'st decrees
The inaudible and noiseless foot of time
Steals ere we can effect them. 2

**ANTONY AND CLEOPATRA,** *Act. III. Sc. XI.*

When valour preys on reason,
It eats the sword it fights with. 3

*Act. V. Sc. ii*

it is great
To do that thing that ends all other deeds
Which shackles accidents, and bolts up change;
Which sleeps, and never palates more the dung,
The beggar's nurse and Caesar's. 4

# షేక్స్పియరుని కవిత్వ మందలి సొగసులు

## వీరరసము

వ॥ కన్యయొక్క గౌరవమూపై విశేషము మఱియుఁ బరువు నంటియై
శ్వర్యమే దాయమున్నాదు॥ 1

గీ॥ అవసరంపు వంగినతల నందు కొంద।
మేలన నవృద్ధులము మన మింక మనదు।
శీఘ్రుతమవిఘుల మనము నేయకముసు।
జరుగుసన్నగఁగాల నిశ్శబ్దపదము॥ 2

ద్వి॥ వీరత్వ మూహదోఁ పిడి నేయునపుడు।
పోరాన చేఁడు వాలుఁ బోదవి భక్షించు॥ 3

గీ॥ తక్కుపనులనెల్లఁ జక్కఁడు కార్యము।
నేఁతగొప్ప యద్ది చేట్లుకట్లు।
మాఱు పడ్డఁ గుక్క మఱి పేడతినఁబోడు।
పేదకు దొరకింక దాదియగును॥ 4

His legs bestrid the ocean ; his reared arm
Crested the world ; his voice was propertied
As all the tuned spheres, and that to friends ;
But when he meant to quail and shake the orb,
He was as rattling thunder. For his bounty,
There was no winter in't ; an autumn't was,
That grew the more by reaping ; his delights
Were dolphin-like ; they showed his back above
The element they lived in : in his livery
Walked crowns and crownets ; realms and islands were
As plates dropped from his pocket. 5

Saucy lictors
Will catch at us, like strumpets; and scaldrhymers
Ballad us out o'tune : the quick comedians
Extemporally will stage us, and present
Our Alexandrian revels. 6

**AS YOU LIKE IT** *Act. I. Sc. II*

I beseech you, punish me not with your hard thoughts, wherein I confess me much guilty to deny so fair and excellent ladies anything. But let your fair eyes and gentle wishes go with me to my trial; wherein if I be foiled, there is but one shamed

that was never gracious; if killed, but one dead that is willing to be so. I shall do my friends no wrong for I have none tolament me; the world no injury, for in it I have nothing; only in the world I fill up a place, which may be better supplied when I have made it empty. 7

**CORIOLANUS** *Act I. Sc. I*

I sin in envying his nobility ;
And were I anything but what I am,
I'd wish me only he. 8

*Sc. iii.*

I pray you, daughter, sing ; or express yourself in a more comfortable sort : if my son were my husband I should freelier rejoice in that absence wherein he won hononr, than in the embracements of his bed where he would show most love. When yet he was but tender-bodied, and the only son of my womb ; when youth with comliness plucked all gaze his way; when for a day of Kings' entreaties, a mother should not sell him an hour from her beholding; I,—considering how honour would become such a person; that it was no better than picture-like to hang by the wall, if renown made it not stir, — was pleased to let him seek danger where he was like to find fame. To a cruel war I sent him ; from whence he

డమీపోయగపు చూపులుస్మంచి కోర్కులు న్రానిండు-నేనం
దోడితి నేని-యెప్పటి కదృష్ట హీనుఁడొకఁడు మాత్రము లజ్జింపఁబ
డును - నేఁజంపఁబడినచో నట్లగుటకుంగోరుచున్న వాఁడే.మఱియిం
పంబడును-నామిత్రులకు నే నెగ్గునలుపఁబోవ - నేమన-నన్గూర్చి యె
డ్చువారు నాకెవరున్లేరు-జగమునకుఁ గీడొనరింప-నందునా కెద్దియు
లేదుగనుక-లోకములో నొకస్థలము మాత్ర మాక్రమించుకొం
టి నది నేను త్తేఁజేసినప్పుడు-తగునట్లు పూర్తిఁ జేయఁబడును॥ 7

గీ॥ .వాని.ఘనతఁజూచి .నేనోర్వ లేకుంట।
.చేతఁ.బాతకంబు ఁ.జెందినాఁడ।
.నేను నేనుఁగాక. కేదియైన స్మృతి।
.వాఁడె నేనగుటకు ..వాంఛ గొందు॥ 8

వ॥ నిన్నుతిమాలెద న్గోడలా పాడుము లేకుల్లాసముగా మాట్లాడుము-
వాఁడేనా పెనిమిటి యైనయెడ- సెజ్జపై బిగికౌఁగిలింపులచేఁ బ్రేమ
చూపుటకన్న-వాఁడు జయమందుటకై నన్వీడనాడినచో మఱింత
యెక్కుడుగా సంతోషించెదను-వాఁడు లేఁతశరీరముకలిగి-నాకొ
క్కఁడేకొడుకై నప్పుడును-వయ సందము వాని త్రోవనెల్ల .చూ
డ్కి .నాకసిఁ ఁ ంచి నపుడు- దినమెల్ల రాజు బతి మాలినప్పటికి
గడియయైన వానిందన కనుల యెదుట నుండి తల్లి యెడఁబా
యఁగూడనప్పుడున్ గీర్తి యట్టివాని నెట్లలంకరించునో యనియు-

నార్తాంబర్లేండుప్రభువు తనకొడుకగు హాట్స్పురు యుద్ధమునఁ జచ్చెననియు, వర్సెస్టరు డౌలాసులు పట్టుబడిరనియు, నాల్గవ హెన్రీ మహారాజు జయమందెననియు విని తల్లడిల్లుట-యార్కుగురువు సేనఁగూర్చుకొని నాల్గవహెన్రీమహారాజు నెదిరింపఁబోవుట - మౌబ్రేయార్కుగురువు హేస్టింగ్సులను లంకాస్టర్యువరాజగుజాను సంధికై బాసయొనర్చి వారిసైన్యము మళ్ళిపోయినపిమ్మట మోసమున వారింజంపుట కాజ్ఞయిడుట-హార్కోర్టు నాల్గవ హెన్రీమహారాజునకు నార్తాంబర్లేండుప్రభువు, బార్డ్లుప్రభువు సైన్యముతోఁ గూడ నోడింపఁబడిరని తెల్పుట మిక్కిలి జబ్బుననున్న తండ్రియొద్దనుండు వేల్సు యువరాజు కిరీటమున్గొనిపోవఁగా మూర్ఛనిద్దుర మేల్కని నాల్గవ హెన్రీ మహారాజు తనతక్కినకొడుకులతో ధనాశం గూర్చి యుపన్యసించుట-మఱికొంచెము సేపోర్చలేకపోతివా యింత తొందఱపడినావే మింకొకఅగంటలో నిరాతంకముగా మిక్కిలియుల్లాసముతో నీవు నామృతిం గాంచి, మకుటము ధరింపఁగలవుకదా యనుతండ్రితో వేల్సుయువరాజు క్షమాపణము చెప్పుకొనుట-వేల్సుయువరాజు నాల్గవ హెన్రీ మహారాజు గతించినపిదప నైదవహెన్రీ మహారాజగుట-ఫాల్స్టాపు మొదలగు తనదుష్టస్నేహితుల నైదవహెన్రీమహారాజు దనపురమునుండి వెడలగొట్టించుట- ఎలిజిబెత్తురాణికి క్షేమముగోరుచు నర్తకుఁడు నాటకము ముగింపుఁ దెల్పుటయును

(11) అయిదవహెన్రీమహారాజను నాటకమునందలి వేసములు

అయిదవ హెన్రీమహారాజు

గ్లాసెస్టర్ప్రభువు-బెడ్ఫర్డుప్రభువును అయిదవహెన్రీమహారాజునకు సోదరులు

ఎక్సిటర్ప్రభువు అయిదవహెన్రీమహారాజునకుఁ బినతండ్రి

యార్కుప్రభువు నైదవహెన్రీమహారాజునకు సన్నిహితజ్ఞాతి

సాలిస్బరీ వెస్టమోరు ఆర్విక్కు ప్రభువులు
కాంటర్బరీగురువు
ఎలై గురువు
కేంబ్రిడ్జి ప్రభువు
స్క్రూపుప్రభువు
సర్థామస్గ్రే
సర్థామస్సెర్పింఘము- గోవరుఫ్లూయెల్లెను-మేక్మోరిసు జామా
అయిదవహెన్రీమహారాజు సేనాపతులు
బేట్సు కోర్టు విలియమ్సులు సేనాపతుల క్రిందిభటులు
పిస్టలు నీము బార్డల్ఫు
బోయి
వార్తచాటువాఁడు
ఫ్రాన్సురాజు
ఫ్రెంచియువరాజు
బర్గండీయార్లియన్సు బూర్బను ప్రభువులు
ఫ్రెంచిభటుడు
దాంబూరీసు గ్రాండ్ప్రీలు ఫ్రెంచి ప్రభులు
మాంటిజో ఫ్రెంచి వార్తావహుఁడు
హార్ఫ్లూయెరు రాజప్రతినిధి
ఇంగ్లాండ్మహారాజు నొద్దకు వెళ్ళినదూతలు
ఇస్బెల్లా ఫ్రాన్సురాజుభార్య
కేతరైను ఇస్బెల్లా ఫ్రాన్సు రాజులకూతురు
అలీసి కేతరైనుచెలికత్తె
పూర్వము క్విక్లీకి నిప్పుడు పిస్టలునకు భార్యయైన ఈస్టుఛీపు పూఁట
కూళ్ళమ్మ ప్రభువులు ఘనురాండ్రు నధికార్లు సైనికులు పౌరులు

దూతలు భృత్యులు సూత్రధారుఁడు రంగస్థలము లింగ్లాండు ఫ్రాన్సులు —కథ.

కాంటర్బరీగురువు నెలీగురుఁడు ఫ్రాన్సుదూత లయిదవహెన్రీ మహారాజుకడకు వచ్చినారని సంభాషించుకొనుట- అయిదవహెన్రీ మహారాజు మంత్రులతోనాలోచించి ఫ్రాన్సునుండి వచ్చినదూతలతో ఫ్రెంచిరాజునకుఁ దా ఫ్రాన్సుపై దండెత్తఁబోవుట తెల్పుమనుట- కేంబ్రిడ్జి స్కూ్రపుగ్రేపిభుల ద్రాజద్రోహులైనందు నైదవహెన్రీ మహారాజు చంపించుట కాజ్ఞయిచ్చుట - అయిదవహెన్రీమహారాజు తనసైన్యము ఫ్రాన్సుదేశములో దిగి, హారూ్ప్రయూ పట్టణాధికారి న్లోఁబర్చుకొనుట- కెతరై నెలీసులు ఫ్రెంచిభాషతో నేమో మాట్లాడు కొనుట- అయిదవహెన్రీ కలేసను పట్టణముచెంత ఫ్రెంచిసైన్యము నోడించుట- ఫ్రెంచిరాజైదవహెన్రీమహారాజునకు దనకూతురగు కేతరైనుం భార్యగా సమర్పించి సంధిచేసికొనుటయును

(12) ఆఱవహెన్రీమహారాజు నాటకము మొదటిభాగమునవచ్చు వేషములు

ఆఱవహెన్రీ మహారాజు

గ్లాస్టరుప్రభువు రాజపినతండ్రియుం బోషకుఁడు

బెన్ఫర్డుప్రభువు రాజుపినతండ్రియు ఫ్రాన్సుదేశపరిపాలకుఁడు

ఎక్సురు రాజుమేనమామ కాఁబోవుప్రధానగురువు

జానోబ్ఫర్టు కాఁబోవుసోమర్సెట్టు ప్రభువు

రిచార్డుప్లాంటేజినెట్టు కాఁబోవు యార్కుప్రభువు

వార్విక్కుప్రభువు

సాలిస్బరీప్రభువు

నఫల్కుప్రభువు

టాల్బట్టు కాఁబోవు ష్రూస్బరీప్రభువు నతని కొడుకు టాల్బట్టును

ఎడ్మండ్మార్టిమరు మార్చిప్రభువు

సర్జానాఫ్టోల్ఫు
సర్విలిమ్లూసీ
సర్విలియంగ్లాన్సుడేలు
సర్తామస్గ్రేవు
పెత్తనగాఁడు
వుడ్విల్లీ కోటకధికారి
వర్నను యార్కుపక్షమువాఁడు
బేసెట్టు లాంకస్టరుపక్షమువాఁడు
న్యాయవాది మార్టిమరునిగాచువాఁడు
చార్లెసు కాఁబోవు ఫ్రాన్సు రాజు
రేగ్నీరు అంజూప్రభువు మఱియుఁ బేరునకుమాత్రముపిల్సు రాజు
బర్గెడీప్రభువు
అలింకన్ప్రభువు
ఆర్లియన్సు జారపుత్రుఁడు
పేరిస్సు రాజప్రతినిధి
ఫిరంగులు కాల్చువాండ్రపై నధికారియు, నతనికొడుకును
బోర్డోలోని సేనానాయకుఁడు
ఫ్రిరిచితలారి-ద్వారపాలకుఁడును
ముసలిగొల్లఁడు పుసల్లీ తండ్రి
మార్గేరట్టు లేగ్నీసరుకూఁతురు హెన్రీరాజునకుఁ గాఁబోవుభార్య
అవర్న్ యజమానురాలు
పుసెల్లీ
ప్రభువులు-కోటకాఁపులు-వార్తావహులు-అధికార్లు-సైనికులు-
దూతలు-భృత్యులు-పుసెల్లీకగపడుదయ్యములు-రంగము కొంతయిం
గ్లాండులో మఱికొంత ఫ్రాంసులో — కథ.
బెడ్ఫర్డు గోస్టరు ఎక్సెటరుప్రభుఁడు వార్విక్కు ప్రభువు వించెస్టరు
గురువు వార్తావహుఁడు మొదలగువా రైదవహెన్రీ మహారాజు

చావునకు విచారించుట-ఫ్రాన్సు దేశములో ఫ్రెంచియువరాజు రాజు కాఁబడి యింగ్లీషువారి ప్రదేశము లాక్రమించుకొని యింగ్లీషు సైన్యమును ధ్వంసమొనర్చెనని దూతలు చెప్పఁగా బెడ్ఫర్డు పదివేల సైనికుల వెంటఁబెట్టుకొని ఫ్రాంసున కేగుట-గ్లోస్టరయిదవహెన్రీ మహారాజు కొడుకు నాఱవహెన్రీ మహారాజుగా నొనర్చుటకుఁ గోటకేగుట-ఎక్సెటరు పసిబిడ్డఁడగు నాఱవహెన్రీ మహారాజు రక్షణమునకై యెల్తామునకుఁబోవుట-ఎల్తామునుండి బాలుఁడగు నాఱవ హెన్రీ మహారాజు న్దొంగిలించుటకై విన్చెస్టరేగుట-ఫ్రాంసులో చార్లెస్సు అలెంకను రేన్నీరు లింగ్లీషు సైనికులచే నోడింపఁబడి యార్లియస్సు జారపుత్రునిచేఁ బిల్వఁబడినపుడు పుసిల్లీ సాయమునఁదిగి యుద్ధమున కారంభించుట- గ్లోస్టరు వించెస్టర్లు శిశువగు నాఱవహెన్రీ మహారాజు న్స్వాధీనపర్చుకొనుట కన్యోన్యము వాదాడుకొనుట - ఫ్రాంస్సులో సేలీస్బరీ గార్గ్రేవులు యుద్ధమున మడియుట - పుసెల్లి ఘోరయుద్ధముచేసి యింగ్లీషుసైనికు లాక్రమించిన యార్లియస్సును పట్టణము దిరిగి ఫ్రెంచిరాజున కధీనముచేయుట-లండన్పట్టణమందలి ప్రభువులు రెండు తెగలై పరస్పర విరోధులగుట - ఆఱవహెన్రీ మహారాజు గ్లోస్టరు, విన్చెస్టరుగురువు, యార్కు, సఫల్కు, సోమర్సెట్టు, మర్విక్కు, ఎక్సెటరు, వర్నను, బేసెట్టు, మఱియుఁ దక్కిన వారు ఫ్రాంసుదేశములోని యుద్ధమునకేగుట-టెల్బట్టు తన సైనికులతో వారింజేయుటయు హెన్రీమహారాజు టేల్బర్టును ష్రూస్బరి ప్రభువుగాఁజేయుట-హెన్రీమహారాజు ఫ్రాంస్సులోఁగూడ నభిషిక్తుఁడై పాస్టోల్ఫుని యుద్ధమునఁ బిఱికియై పాఱిపోయినందుకై దేశమునుండి వెడలఁగొట్టు హెన్రీమహారా జెఱ్ఱగులాబు న్దాల్చుకొనుట- టెల్బట్టు తనకొడుకతోఁగూడ రణరంగమున మడియుట - సఫల్కు - మార్గ్రేరట్టను కన్యక స్వందెగా రణరంగమునఁబట్టుకొని యాపెను హెన్రీ మహారాజునకుఁ బెండ్లి చేయుట కాపెతండ్రి నొప్పించుట - చార్లస్సు

హెన్రీమహారాజునకులోనై ఫ్రాన్సుదేశమును హెన్రీమహారాజునకుఁ బ్రతినిధిగాఁ బరిపాలించుట కంగీకరించి సంధిచేసికొనుట - మార్గరేటట్టు నుఁ దీసికొనివచ్చి తనకుఁబెండ్లి సేయుటకై హెన్రీమహారాజు సఫల్కును ఫ్రాన్సుదేశమున కంపుటయు.

13. రెండవభాగమును నాటకమునదుం వచ్చువేషములు

ఆఱవహెన్రీమహారాజు

గ్లోస్టరు రాజుపినతండ్రి

విఞ్చెస్టరు గురుఁడు రాజుపెదతండ్రి

యార్కుప్రభువు ఎడ్వర్డు రిచార్డు లతనికొడుకులు

సోమర్సెట్టు సఫోల్కు బకింగాము క్లిప్ఫర్డు ప్రభువులు రాజుపక్షము వారు

సేలిస్బరీ వార్విక్కుప్రభులు యార్కుపక్షమువారు

స్కేల్సుప్రభువు దుర్గాధ్యక్షుఁడు

సేప్రభువు

స్టాఫర్డుహంప్రీ అతనితమ్ముఁడువిల్యముస్టాఫర్డు

సజాన్ స్టేన్లీ

వాల్టరువిట్మోరు

సముద్రనౌకాధికారి కర్ణధారుఁడు సేవకుఁడు

సఫాల్కు బందెలుగాఁబట్టుకొన్న ఇద్దఱుతగుమనుష్యులు

వాక్సు

హ్యూము సౌత్వెల్లులు గురువులు

రోగర్బాలింగుబ్రూకు-గారడీవాఁడు-వానిచేరావింపఁబడుదయ్యము -

హార్నరు శస్త్రకారుఁడు-పీటరు వానిసేవకుఁడు

చాతాము లేఖరి

సేంటాల్బను గ్రామాధికారి

సింపీకాక్సు మోసగాఁడు

కేడు-వానివెంబడినున్నవారు-జాన్సీబిలిస్సు జాన్హాలెండు-డిక్కునుకటికె
స్మిత్తనుసాలెవాఁడు-మెఘేలు మొదలగువారు
ఐడెను కెంటిషు తగుమనుష్యుఁడు
ఇర్వురు ఘాతుకులు
మార్గేరట్టు ఆఱవహెన్రీ మహారాజుభార్య
ఎలీనరు గ్లోస్టరుప్రభ్వి
జౌర్డేను మంత్రకర్త
సింపోక్సు వానిభార్యయు
ప్రభువులు-దేవులు-పరిచారకులు - వార్తావహులు - మనవిచేసికొను
వారు - ఆల్డర్మెన్ను-బిళ్ళబంట్రోతు-అధికారి-ఉద్యోగులు -పౌరులు-
పనినేర్చుకొనువాండ్రు-డేగవేటఁకాండ్రు-రక్షకభటులు - సైనికులు-
దూతలు మొదలగువారు- రంగము ఇంగ్లాండుయొక్క నానాప్రదేశ
శములు — కథ.

మార్గేరట్టును హెన్రీమహారాజు పెండ్లాడుట - గ్లోస్టరు మొద
లగు కొందఱి కనిష్టమాట-మార్గేరట్టు సఫాల్కును గ్లోస్టరు మొదలగు
కొందఱి ప్రభులను ధ్వంసముకావించుటకు నిర్ణయించుకొనుట - రాజు
గ్లోస్టరుభార్య న్దేశమునుండి వెడలగొట్టుట - మఱి గ్లోస్టరుని యధికార
మును లాగుకొనుటయు, యార్కు వించెస్టరు గురువు - సఫాల్కు
రాణియు గ్లోస్టరుపై రాజద్రోహము నేరముమోపి, యతనిం జెఱ
సాలనుంచుట-రాజు గ్లోస్టరు చెఱనుంట విధిలే కొప్పుకొని దుఃఖించుట-
వించెస్టరు గురువు సఫాల్కు యార్కు రాణియు గ్లోస్టరుని జంపుటకు
నిశ్చయించుకొనుట-ఐర్లెండు దేశవుజను లింగ్లీషువారిపైఁ దిరుగుపా
టొనర్చి రనుమాటవిని యార్కును సేననుగూర్చికొని, ఐర్లెండుపై
వెళ్ళుమని తక్కినప్రభువులు పంప నుద్దేశించినవు డదేసమయమని
యార్కు తా రాజగుటకు నిర్ణయించుకొనుట - సఫాల్కు గ్లోస్టరుని
నిఱుగించుచుండగాఁ జెఱసాలలోఁ జంపించుట-ఆసంగతి బయల్పడఁగాఁ

ప్రజల కోరికపై రాజు సఫాల్కును దేశమునుండి వెడలఁగొట్టుట కాజ్ఞ యిడుట - రాణి సఫాల్కుని శిక్షింపవద్దని రాజును బతిమాలు కొనుట-వించెస్టరు గురువు కెత్తి చచ్చుట-కెంటు యొద్ద నౌకాధికారి సఫాల్కుం బట్టుకొని యతని దౌర్జన్యము నెత్తిపొడుచుచు జంపుట- రాజ్యముపైఁ దిరుగుబా టొనర్చిన కేడు మొదలగువారిచే స్టాఫా ర్డతని తమ్మునితోఁ జంపఁబడుట - కేడు మార్టిమర్ప్రభునామము వహించి రాజగుటకు నిశ్చయించుకొనుట - రాజు ప్రతికక్షులకుజడిసి రాణితో కిల్లింగ్వర్తునకుఁ బారిపోవుట- కే డియాజ్ఞచే సేప్రభు వల్లు నితోఁగూడఁ జంపఁబడుట - బకింగాము, ముసలి క్లిఫర్డుసైన్యముతో వచ్చి కేడు సైనికులను మంచిమాటలతో లోబర్చుకొనుట- కేడు పారి పోవుట - యార్కైర్లెండునుండి సైన్యముతోవచ్చి సోమర్సెట్టును రాజునుండి తొలగింపఁ బూనుచున్నాఁడని దూతలు రాజున కెఱింగిం చుట - సోమర్సెట్టునెద్మండును రాజు జెఱసాలకనుపుట - ఐడెను తన తోటలో డాగిన కేడ్ని జంపుట-యార్కు తనకొడుకులగు నెడ్వర్డు రిచార్డుల వార్విక్కు సేలిసబరీలను సహాయులుగాఁ గైకొని రాజ్య మాక్రమించుకొనుటకు యుద్ధసన్నద్ధుఁడౌట - యార్కు రణరంగమున క్లిఫర్డుంజంపుట - క్లిఫర్డుకొడుకు తన తండ్రిదేహముం గొని పోవుట - రిచార్డు సోమర్సెట్టుం జంపుట - లండనుపురికిఁ బారి పోయినరాజు నబట్టుకొనుటకు యార్కు నతనికొడుకులను వార్విక్కు సేలిస్బరీలు వెంటదఱుముటయును

**ఆఱవ హెన్రీమహారాజు**

(14) మూడవభాగమను నాటకము వచ్చువేసములు

ఆఱవహెన్రీమహారాజు అతనికొడుకు యువరాజగు నెడ్వర్డు

పదునొకండవలూయి ఫ్రాన్సురాజు

సోమర్సెట్టు ఎక్సెటరు ఆక్సుఫర్డు నార్తాంబర్లెండు వెస్టమోర్లెండు

క్లిఫర్డు ప్రభువులు రాజపక్షమువారు

యార్కు నాల్గవయెడ్వర్డురాజు కాఁబోవునెడ్వర్డు రట్లెండు ప్రభువగు నెడ్మండుఁ కాబోవుక్లారెన్సు ప్రభువగుజార్జి కాఁబోవుగ్లోస్టరు ప్రభువగురిచార్డు యార్కుకొడుకులు నార్ఫాల్కు మాంటేగు వార్విక్కు హేస్టింగ్సుప్రభువు॥ యార్కుపక్షమువారు

స్టాఫర్డు సర్జాన్మార్టిమరు సర్హ్యూగ్మార్టిమరు యార్కుపినతండ్రులు

రిచ్మండుప్రభుఁడగు హెన్రీ బాలకయౌవనుఁడు

రివర్సుప్రభువు గ్రేదేవిసోదరుఁడు

సైన్క్లో

మాంటి గోమరి

సామర్విల్లి

రట్లెండు గురువు

యార్కునందలి యధికారి

దుర్గాధ్యక్షుఁడు

ఒకఘనుఁడు

ఇద్దరుకావలివాండ్రు

ఒకవేఁటకాఁడు

తండ్రిం జంపిన కొడుకు

కొడుకుం జంపినతండ్రి

మార్గరెట్టురాణి

కాఁబోవునాల్గవయెడ్వర్డు-రాణియగుగ్రేదొరసాని

జోనా ఫ్రెంచిరాణికి సోదరి

భటులు హెన్రీమహారాజునకు నెడ్వర్డుమహారాజునకుం బరిచారకులు దూతలు కావలివాండ్రు మొదలగువారును రంగము ఇంగ్లాండు మఱియు ఫ్రాన్సును — కథ.

యార్కు ఎడ్వర్డు రిచార్డు నార్ఫల్కు మాంటేగు వార్విక్కు మఱియుఁ దక్కినవారు తెల్లగులాబీపూలు తమచేతులఁ బట్టుకొని రాజసభకువచ్చుట-యార్కుసింహాసనముపైఁ గూర్చుండుట-హెన్రీ మహారాజు క్లిఫర్డు నార్తాంబర్లెండు వెస్టుమోర్లెండు ఎక్సెటరు మఱియుఁ దక్కువారు నెఱ్ఱ గులాబీపూలు పట్టి రాజసభకువచ్చుట-ఉభయ పక్షములవారికి వాక్కలహము జరుగుట - హెన్రీమహారాజు తా బ్రతికినంతవఱకు మాత్రము రాజమకుటము ధరించుటకును బిదప యార్కు నతని పుత్రులు రాజులగుట కొప్పుకొనుట-ఉభయపక్షముల వారలు మైత్రిఁగొన నంగీకరించుట-మార్గరెట్టురాణి రాజు నిందించి తన కొడుకుతో సైన్యముఁ గూర్చుకొని యార్కుతో యుద్ధము చేయుట-క్లిఫర్డు రట్లెండుం జంపుట-యార్కుపక్షమువా రోడిపోవు చుంటయుఁ దనపినతండ్రు లిరువురుం జంపఁబడుటయుఁ గని యలసి నీరసిలి శత్రులచేఁజిక్కుట-మార్గరెట్టు యార్కును దెప్పి దెప్పి పొడిచి చంపుట-క్లిఫర్డు రణరంగమున పడియుట-యుద్ధమునఁ బరాజితుఁడైన యాఱవ హెన్రీ మహారాజు మాఱువేషముతోనుండి కాఁపుచేఁ బట్టువడుట-నాల్గవయెడ్వర్డు మహారాజు ముగ్గురు పిల్లలుగల యొక వితంతువును వలచి, యామె నదరాణిగాఁ జేయగోరుట-గ్లోస్టరుప్రభువు తా రాజు గాఁగోరుట - వార్విక్కు ఫ్రెంచిరాజుతో నాల్గవఎడ్వర్డు మహారాజున కతని చెల్లెలను బెండ్లిచేయుమని యడుగుట-మార్గరెట్టు తనకుమారుని నాక్సుఫర్డును వెంటనిడుకొని ఫ్రెంచిరాజునుఁ దనకు సాయపడుమని యడుగుట - నాల్గవయెడ్వర్డుమహారాజు ఆఱవ హెన్రీ మహారాజు న్గారాగృహమున నుంచుట-నాల్గవయెడ్వర్డు గ్రేదొర సానిం బెండ్లాడిన వార్త తెలిసినపిదప వార్విక్కు మార్గరెట్టులు మైత్రింబొంది ఫ్రెంచిరాజు సాయమున సైన్యము కూర్చుకొని నాల్గవయెడ్వర్డుపైకి వచ్చుట - వితంతువుం బెండ్లాడి యామె సోదరునకు మఱి యామెకుమారునకుం దాము వలచిన కన్నియలం బెండ్లిచేసినందుకు రాజుపై క్లారెన్సు గ్లోస్టరు ప్రభువు లసహ్యా పడుట-ఫ్రెంచిరాజు కోపమున తనపై సేనలు పంపుచున్నాఁడనియు,

ఫ్రెంచిరాజు చెలియలు తనకై పెండ్లి మాడెదనని యొట్టు వైచు
కొనెననియు, వార్విక్కు మార్గరెట్టులు మైత్రిం బొందిరనియు,
వార్విక్కు తన్ను రాజపదవినుండి తప్పింపం జూచెననియు, వార్విక్కు
కూఁతు నెడ్వర్డుయువరాజు పెండ్లి యాడుననియు నాల్గవయెడ్వర్డు
మహారాజు దూతలవలనవిని యుద్ధసన్నద్ధుఁడగుట - వార్విక్కు
రెండవకుమార్తెం బెండ్లాడెదనని క్లారెన్సు తనయన్నయగు రాజుతో
విడఁబడి సోమర్సెట్టుతోఁ గలసిపోవుట - గ్లోస్టరు తనయుద్దేశము నెఱ
వేర్చుకొనుటకై రాజుపక్షముననుండుట-వార్విక్కు క్లారెన్సుసోమర్సె
ట్టుఆక్సుఫర్డులు శిబిరమున నిదురించుచున్న రాజు సన్నసన్నగ వచ్చి
పట్టుకొనుట-చెంతనున్న గ్లోస్టరు హేస్టింగ్సులు పరుగెత్తిపోవుట-
ఎలిజబెత్తురాణి యను పేరొందిన నాల్గయెడ్వర్డుమహారాజుభార్య తన
గర్భము రక్షించుకొనుటకై సోదరునితో మఠములోఁదాగుండుట-
గ్లోస్టరు హేస్టింగ్సులు నాల్గవయెడ్వర్డుమహారాజుఁ జెఱవిడిపించి తీసి
కొనిపోవుట-ఆఱవహెన్రీ మహారాజు వార్విక్కు-క్లారెన్సు మాం
టేంగు నెక్ట్సరు మఱియు నాక్సుఫర్డులు ఫ్రాన్సునుండి సైన్యము
కూర్చుకొని వచ్చెడు నాల్గవయెడ్వర్డు మహారాజు జయింప యుద్ధ
సన్నద్ధులగుచుండగా నాల్గవయెడ్వర్డు మహారాజుంగ్లోస్టరు నాఱవ
హెన్రీమహారాజు బట్టుకొని చెఱసాలకంపుట-క్లారెన్సు తనయన్నలగు
నాల్గవయెడ్వర్డు మహారాజు గ్లోస్టర్లతోఁగలసి వార్విక్కు నెదిరించుట-
వార్విక్కు నాల్గవ యెడ్వర్డు మహారాజుచే యుద్ధమునఁ బొడవబడి
మరణవేదనలోఁ దన స్థితిఁ దలఁచుకొని తలడిల్లుట-నాల్గవ యెడ్వర్డు
మహారాజు మార్గరెట్టురాణిని సోమర్సెట్టాక్సుఫర్డులను రణరంగమున
బందెలుగాఁ బట్టుకొని యాక్సుఫర్డు సోమర్సెట్టుల నత్క్షణము చంపుట
కాజ్ఞయిడుట - నాల్గవయెడ్వర్డు మహారాజు ఎడ్వర్డు యువరాజుం
బొడిచిచంపి, మార్గరెట్టు నటనుండి తొలఁగింపఁబడ నాజ్ఞయిడుట-
గ్లోస్టరు చెఱసాలకుఁ బరువిడి ఆఱవహెన్రీ మహారాజుం బొడిచి

చంపుట-నాల్గవయెడ్వర్డు మహారాజు సింహాసనముపైఁ గూర్చుండి తన తమ్ములతో ముచ్చటించుచుఁ దన రాణియగు నెలిజబెత్తుతో మఱియు నాపెయందుఁ దనకు బుట్టిన పుత్రునితోడ నానందించుచు మార్గేరట్టురాణి ఫ్రాన్సునకుఁ బంప నాజ్ఞయిచ్చుటయును.

(15 ఎన్మిదవ హెన్రీ) మహారాజు జీవనచరిత్రమను నాటకమున వచ్చు వేషములు

ఎన్మిదవ హెన్రిమహారాజు
వుల్సీగురువు
కాంపియన్గురువు
కాపాసియస్సు అయిదవచార్లెస్సునుండి వచ్చినదూత
కాన్మెరుకాంటర్బరీగురువు
నార్ఫాల్కు ప్రభువు
సఫల్కు ప్రభువు
బకింగాము ప్రభువు
సరే ప్రభువు
రాజగృహాధ్యక్షుఁడు
గార్డినరు వించెస్టరుగురువు
లింకోలు గురుఁడు
అబర్గేవెన్నీ ప్రభువు
సేండ్సు ప్రభుఁడు
సర్హెన్రీ గిల్ఫర్డు
సర్తామస్లవెల్లు
సరాంథనీడెన్ని
సర్నికోలాస్వాక్సు
వుల్సీచేతిక్రింద యుద్యోగులు
క్రామ్వెల్లు వుల్సీ సేవకుఁడు

గ్రిఫ్ఫీతు కేతరైనురాణికి ద్వారపాలకుఁడు
ముగ్గురు తగుమనుష్యులు
గార్టరు ఆయుధరక్షకుఁడు
బూటసు రాజవైద్యుఁడు
బకింగాము చేతిక్రిందిపనివాఁడు
బ్రాండను మఱియొక యాయుధరక్షకుఁడు
సభా ద్వారపాలకుఁడు
శౌవారికుఁడు వానిసేవకుఁడు
గార్డినరునిసేవకుఁడు వార్తావహుఁడు
కేతరైనురాణి ఎన్మిదవ హెన్రీమహారాజుభార్య అనీబుల్లీనురాణి
చెలికత్తె-బుల్లీనుమిత్రురాలగు నొకముసలి యిల్లాలు పేషన్సు కేత
రైనుదాసి

మూఁగచేష్టలనుండు ననేకప్రభువులు దొరసానులు రాణివెంబడినుండు
స్త్రీలు రాణికగపడుదయ్యములు లేఖరు లుద్యోగులు రక్షకభటులు
తక్కిన భృత్యులు రంగము లండను వెస్టమిన్స్టరులలో ముఖ్యముగా
నొకప్పుడు కింబాల్టనులోను — కథ

బకింగాముప్రభువును బర్గేవిన్నిప్రభువును కార్డినల్వుల్సీ దౌర్జ
న్యము నడలపోయుచు నాకస్మికముగా రాజాజ్ఞచేఁ జెఱసాల నుంపించఁ
బడుట-రాజు రాణుల సముఖమున వుల్సీప్రోత్సాహముచే బంకింగాము
చేతిక్రింది యుద్యోగి బకింగామునకు రాజద్రోహప్రయత్న మున్నదని
ప్రమాణము చేసి చెప్పుట-బంకింగామునకు మరణశిక్ష విధించుట-
వుల్సీయింట విందైనపుడు రాజు బుల్లీనుంగాంచి మోహించుట-వుల్సీ
పన్నిన కుట్రవలన రాజున కిరువదేండ్లనుండి తనతోఁగాపురముచేయు
చున్న కేతరైనకు విడాకులీబుద్ధిపుట్టుట-కేతరైను రాజుతోడ న్వాడ
నాడఁదగదనియు, వుల్సీదౌర్జన్యముచే నంతవచ్చెననియు విలపించుట-

మిక్కిలి యన్యాయముగ సంపదఁ బోఁగుచేసికొని, రోమునందలి తన హితులకై ప్రయత్నించు మతాధ్యక్షునకు రాజద్రోహము న్వెల్లడించు చున్న వుల్సీగుట్టు రాజెఱిఁగి యతనికి దానిచ్చిన యధికారముద్ర లాగుకొనుట-వుల్సీ తా మతగురువయ్యు దైవచింతన మందుండక రాజ్యకార్యములం దగిలి మోసపోయినందునకు మిక్కిలి చింతించుట-కేతరైను వయసుమళ్ళుటచేత నాపె పలువురఁ బిల్లలఁగన్నప్పటి కొక కూఁతురుమాత్రమే మిగులుటచేత మఱియు వుల్సీ యాపెపైఁ జెప్పిన కొండెములఁబట్టియు రాజు రూపయౌవనశాలియగు బుల్లీనుం దా వలచుటచేత నాపె మిక్కిలియోగ్యురాలని తనకు నమ్మకమున్నప్పటికి నాపె న్విడనాడుట-బిల్లీను యథావిధిగ రాజుం బెండ్లాడి రాణియగుట-గ్రిఫీతు సంకటపడియున్న, కేథరైనుతో వుల్సీ తనయధికారము దొలఁగి యాకస్మికముగా జబ్బుపడి, మృతిచెందెనని చెప్పుట - కేతరైను మృతిచెందుట-క్రామవెల్లును రాజు శత్రులనుండి కాపాడి యతనికి నతనిపై నేరములు మోపినవారికి సఖ్యముసేయుట-రాజునకు బుల్లీనురాణివలనఁగలిగిన కూఁతునకు క్రామెల్లెలిజెబెత్తని పేరిడు యాపిల్ల జగత్ప్రసిద్ధివడసి, చిరము రాజ్యమేలి, కన్నయై స్వర్గమునకేగునని పల్కుటయును.

(1౮) జాన్మహారాజుచరిత్రమను నాటకమున వచ్చు వేసములు

జాన్మహారాజు నతనికొడుకు హెన్రీయువరాజు

ఆర్తరు బ్రిటగ్ని ప్రభువు

పెంబ్రోఁకుప్రభువు

ఎస్సెక్కుప్రభువు

సేలిస్బరీప్రభువు

నార్ఫాల్కుప్రభువు

హ్యూబర్టన్ రాజగృహాధ్యక్షుఁడు

రాబర్టు ఫాల్కబ్రిడ్జి

ఫిలిప్పుఫాల్కన్‌బ్రిడ్జి
జేమ్సుగర్నీ ఫాల్కన్‌బ్రిడ్జిదొరసాని సేవకుఁడు
పాంఫ్రెట్టు పీటరు
ఫిలిప్పు ఫ్రాన్సురాజు
లూయీ ఫ్రెంచియువరాజు
ఆస్ట్రియారాజు
పండూల్ఫు పోపుగురుఁడంపినగురువు
మెలూను ఒక ఫ్రెంచిప్రభువు
చాటిల్లను ఫ్రాన్సునుండివచ్చినదూత
ఎలీనరురాణి రెండవహెన్రీమహారాజుభార్య
కాన్ష్టెన్సు ఆర్తర్ తల్లి
బ్లాంచి కాస్టైలురాజుకూఁతురు
ఫాల్కన్‌బ్రిడ్జి దొరసాని

ప్రభువులు దొరసానులు ఆంగీర్సుపౌరులు అధికారి వార్తావహులు ఉద్యోగులు సైనికులు దూతలు మఱియుఁ బరిచారకులు రంగము ఒకప్పు డింగ్లాండులో మఱొకప్పుడు ఫ్రాన్సులోన— కథ.

చాటిల్లనురాజుతో రాజుయొక్క యన్నకొడుకగు నార్తరునకు రాజ్యమీనిచో నతని ఫ్రెంచిరాజు యుద్ధమున నోడించెద నన్నాఁడని చెప్పుట-జాన్మరాజు ఫిలిప్పాల్కన్‌బ్రిడ్జికి సర్ రిచార్డను పేరొసఁగి, తన యొద్దనుంచుకొనుట - జాన్మహారాజు ఫ్రెంచిరాజును ఫ్రాన్సుప్రభులు యుద్ధసన్నద్ధులై బ్లాంచిమ్మాయికి పెండ్లిచేసి, ఫ్రాన్సులోనియైదింగ్లీషు పరగణాలు వారికిచ్చుటకు నార్తరుని బ్రిటన్నీ ప్రభువుగాఁజేసి యతని యాంజీరుపట్టణ మతనికిచ్చుటకుఁ దామిరువురు మైత్రినొందుటకు సంధి చేసికొనుట - తనకొడుకును ద్రోసిరాజుచెప్పి, ఇంగ్లాండు ఫ్రాన్సు రాజులు సంధిచేసికొనుటకు మిక్కిలి కాన్ష్టెన్సు పొగలి తనతండ్రితో

నట్లుచేయుట - ధర్మముకాదని వాదించుట - పాండలు పోవునకు విరు
ద్ధముగా జాన్మహారాజును గద్దింపఁగా జాన్మహారాజు పోపుసంబంధము
తనకెంతమాత్రమును లేదనుట - పాండల్ఫు ఫిలిప్పును జాన్మహా
రాజుపైఁ గత్తి కట్టుమని పురికొల్పుట - పోపు పైఁ దనకుఁగలగౌర
వముఁబట్టి ఫిలిప్పు జాన్మహారాజుతో యుద్ధముసేయుట - జాన్మహారా
జార్థరు రణరంగమునఁ బట్టుకొని యతనిఁ గడతేర్చుమని హ్యూబ
ర్టున కప్పగించి, యెలీనరు రిచార్డు హ్యూబర్టార్థర్ల నింగ్లాండు
నకు ముందుగాఁబంపివైచి తాఁగూడ సైన్యముతో విజయమంది యేగు
ట - హ్యూబర్టు కాలినయినుముతో నార్థరు కనులుగాల్చి, యతనిఁ
జంపబోయి కనికరమున నట్లుజేయకుంట - జాన్మహారాజు సింహాసనమందు
గూర్చున్నపుడు హ్యూబర్టుచెవిలో నార్థరు చంపబడెననిచెప్పుట -
ఆసంగతి బయల్పడగా సేలుసు పెంబ్రోకులు మిగులఁగోపముతో లేచి
పోవుట - ఫ్రాన్సునుండి దూతవచ్చి, కాన్స్టెన్సు పుత్రవిహార
మునఁ జచ్చెననియు, లూయీ గొప్పసైన్యముతో వచ్చుచుండె
ననియునుఁ దెలియఁజెప్పగా, జాన్మరాజు భయపడుట - ఆర్థరు
చెఱసాలగోడ దుమికి క్రిందపడి మృతిజెందుట - పాండో
ల్ఫునకు జాన్మహారాజు తనకిరీటమునొసఁగి మరల నతని యాశీర్వా
దముతో దానిం గైకొనిపోవునకుఁ దా నమ్రుఁడనని వాకొని లూయీ
సైన్యము న్మఱలించుమని బతిమాలుట - రిచార్డు వలనఁ దిరిగి ప్రేరే
పింపబఁడి జాన్మహారాజ యుద్ధసన్నద్ధుఁడౌట - పాండోల్ఫు మాటవినక
లూయీ యుద్ధభేరి మ్రోయింపంజేయుట - జాన్మహారాజు రణరంగము
నుండి జ్వరమునఁ గ్రాగుచు నొకమఠమునందు పడియుంట - రిచార్డు
లోకైక వీరత్వముజూపి, శత్రులనుఱుముసేయుచుంట - మెలూను మడి
సెననియు, సేలిస్బరి పెంబ్రోకు ప్రభులు తిరిగి జాన్మహారాజు పక్ష
మవలంబించిరనియు, సాయమువచ్చుచున్న ఫ్రెంచియోడలు మునింగి

పోయినవనియు దూత లూయియాతో చెప్పుట-జాన్మపోరా జాక సన్యాసి తనకుం బెట్టినవిషముచే మృతిజెందుటయును

(17) లియర్మహారాజు దుఃఖాంతనాటకమున వచ్చు వేషములు

లియరు బ్రిటెనారాజు
ఫ్రాన్సురాజు
బర్గండీప్రభువు
కారన్వాలుప్రభుండు
ఆల్బనీప్రభువు
కేంటుప్రభువు
గ్లోస్టరుప్రభువు
ఎడ్గారుగ్లోస్టరుప్రభునికొడుకు
ఎడ్మండు గ్లోస్టరుప్రభుండు జారత్వమునంగన్నకొడుకు
క్యూరను రాజసభాసదుండు
ఆస్వాల్డు గనేరిల్లుకార్యదర్శుండు
వృద్ధుండు గ్లోస్టరుని రైతు
వైద్యుండు
విదూషకుడు
ఎడ్మండుచే నుపయోగింపంబడిన యధికారి
కార్డీలియాకు భృత్యుండగు నొకతగుమనుష్యుండు
వార్తావహుండు
కారన్వాలుని సేవకులు
గనేరిలురిగను కార్డీలియాలు లియరునికూంతుళ్లు

లియరుతోంజేరినశూరులు అధికార్లు దూతలు సైనికులు మఱియుం బరిచారకులు రంగము బ్రిటెను—కథ.

కారన్వాలాల్బనీల పెండ్లాడిన గనేరిరీగనుల తన పెద్దకుమార్తెలు తన్ను మిక్కిలి ప్రేమించితిమని ముఖస్తుతిచేయంగా లియర్మహారాజు యథార్థమాడిన కార్డిలియాపైఁ గోపించి తన రాజ్యమంతయుం దన పెద్దకుమార్తెలకే పంచియిచ్చుట - కార్డిలియా మిగుల యోగ్యురాలు-యథార్థము పల్కె నాపై నల్కవలదను కెంటును రాజు దేశమునుండి వెడలఁగొట్టుట-ఫ్రాన్సు రాజు కార్డిలియా యథార్థతకుమెచ్చి యామెపె న్దనరాణిగాఁగైకొని తనదేశమున కరుగుట-ఎడ్మండెడ్గారు వ్రాసిన ట్లొక పత్రమును వ్రాసి గ్లోస్టరున కగపర్చుట-నీవు వృద్ధుఁడవైతి వింటి వ్యవహారము నేఁ జక్కబెట్టెద నను నర్థమందుఁ గాన్పింపగా గ్లోస్టరెడ్గారుపై నల్కఁబూనుట- కెంటు మారువేసమున లియరునొద్ద సేవకుఁడై యుంట-లియరు గనేరిలచేఁ దిరస్కరింపఁబడి రీగను యొద్దకుఁ బోవుట-రీగను గనేరిలు కలిసి తన్ది రస్కరించుట కోర్వక లియర్మహారాజు బెద్దియుఁదోఁచక, వెఱ్రెత్తినట్లు కెంటు గ్లోస్టరు విదూషకులతోఁ బైకిఁబోవుట - రాజు కెంటువిదూషకులు గ్లోస్టరుచూపిన సౌధమున గాలివానలోనుంట- ఎడ్మండుకారన్వాలులు గ్లోస్టరుని రాజద్రోహిగా భావించి చెఱుపఁబూనుట - కూఁతుళ్ళకుట్రచేఁ జంపఁబడుట కుద్దేశింపఁబడిన లియర్మహారాజును గ్లోస్టరు కెంటు విదూషకులు డోలితో డోవరను స్థలమునకు మోసికొనిపోవుట-కారన్వాలీగనడ్మండుల దౌర్జన్యముచే గ్లోస్టరు గ్రుడ్డిగావింపఁబడి డోవరునకు నెట్టింపఁబడుట - కార్డిలియా తన మగండగు ఫ్రెంచిరాజుతో సైన్యము కూర్చుకొని, తనసోదరులపై దండెత్తివచ్చి తన తండ్రిన్దన యొద్ద నుంచుకొనుట - రీగను తనభర్త కెంటు సేవకునిచేఁ జంపఁబడినపిదప గనేరిలు వలచియున్న యెడ్మండు న్దాఁబెండ్లాడఁగోరి యతనికి వర్తమానమంపుట-గ్లోస్టరాత్మహత్య చేసికొనుటకు మారువేషమునయున్న యెడ్గారు సముద్రము నొరయు కొండశిఖరమునకెక్కించుమని బతిమాలి యతని చేసడును నేలపై నడుపఁబడుచు వెఱ్రెత్తి

పోవుచున్న లియర్మహారాజు న్గాంసికొని పోగలుట - గ్లోస్టరుం జంప వచ్చిన యాస్వాల్డుని యెడ్మండు చంపి వానిజేబులోఁ దనభర్తం జంపి తన్నేలుకొమ్మని యెడ్మండునకు గనేలు వ్రాసిన జాబు చదివికొని యబ్బురపడి గ్లోస్టరుని యుద్ధభూమినుండి తొలగించి కాపాడుచుంట- కార్డీలియా వైద్యునిచే సాధనముచేయించి కొంత స్వస్థచిత్తుఁడైన తనతండ్రితో సంభాషించుట - రీగనుగనేలుపై మరలుకొనరాదని యెడ్మండుని బతిమాలుట-ఎడ్గారు మారువేషమున నాస్వాల్డు జేబులోని యుత్తరము నాల్బనునకిచ్చి పోవుట - లియర్మహారాజు కార్డీలియాతో రణరంగమునఁ బట్టుపడి యెడ్మండుచేఁ జెఱసాల నుంచఁబడుట - తన్ను వంచించిన తనభార్యయగు గనేలుపై నాల్బను మండిపడుచు నెడ్మండుపై రాజద్రోహమును స్థాపించి, యుద్ధమున కాహ్వానముచేయుట-ఎడ్గారు డెడ్మండు దూషించుచు నేలఁగూల్చుట- ఎడ్గారుఁడాల్బనెడ్మండులలోఁ దనగుప్తచరిత్రము నొడివి, తనతండ్రి న్దాఁబలువిధములఁ గాపాడుటయు, నొకయఱగంట్రకిందట నతనికిఁ దాదయబల్పడుటయు, గెంటు ప్రచ్ఛన్నరూపమున లియర్మహారాజునకు సేవయొనర్చుచుండుటయును దెల్పుట - రీగనుగనేలు ద్వేషమునం జచ్చునట్లు లాల్బను డెడ్మండెడ్గారులతో నుండి సమాచారమువినుట - ఎడ్మండు తనకుట్రచే లియర్కార్డీలియాలు చెఱసాలలోఁ జంపబడనుండిరేని తక్షణము కాపాడవలసినదని రాల్బనుతోఁ జెప్పుట - తన కౌఁగిట న్జచ్చిన కార్డీలియాకై దుఃఖించుచు లియర్మహారాజాల్బను నొద్దం దనుసేవించుచు వచ్చిన కెంటు న్బోల్చి మాట్లాడి దుఃఖవశమున అల్బనుఁడు కెంటెడ్గారుల రాజ్యమేలు కొమ్మని చెప్పుటయును.

18) రెండవరిచార్డ్మహారాజు దుఃఖాంతనాటకమున వచ్చు భూమికలు రెండవరిచార్డ్మహారాజు

లంకాస్టర్ప్రభుఁడగుజాన్గాంటు
యార్కుప్రభువగు లాంగ్లెయొడ్మండులు రాజపితృసోదరులు
హెర్ఫార్డుప్రభువు జాన్గాంటునకుఁగొడుకును భవిష్యచ్చతుర్థహెన్రీ
మహారాజునగు హెన్రీబాలింగ్బ్రూకు
యార్కుప్రభుపుత్రుఁడగునామర్లీన్ప్రభువు
నార్ఫాక్ప్రభువగుతామస్మౌబ్రే
సర్రేప్రభువు
సేలిస్బరీప్రభువు
బర్కులేప్రభువు
రిచార్డ్రాజు సేవకులు బూషీ బాగట్టు గ్రీను
నార్తాంబర్లేండుప్రభువు వానికొడుకు హేన్రీపర్సీ
రాస్ప్రభువు
విల్లోబీప్రభువు
ఫిట్జువాటరుప్రభువు
కార్లిస్లీ గురువు
వెస్టుమినిస్టరుమతాధిపతి
మార్షల్ప్రభువు మఱొకప్రభువు
ఎక్ట్సనుసర్పియర్సీ
సర్ట్సిఫెన్స్క్రూపు
వెలిషీ సేనాధిపతి
రిచార్డుమహారాజుదేవి
గ్లోస్టరుదొరసాని
యార్కుదొరసాని

దేవిచెలికత్తె ప్రభువులు చాటువాండ్రు అధికార్లు సైనికులు ఇద్దరుతోటవాండ్రు ద్వారికుఁడు దూత కింకరుఁడు మఱియుఁ దక్కిన సేవకులు రంగ మింగ్లాండునందు వేల్సునందును—— కథ .

బాలింగ్బ్రూకు నార్ఫోల్కులు రాజు నొద్ద స్పర్ధఁబూనుట గ్లోస్టరుదొరసాని గాటుకుఁబగ దీర్చుకొమ్మని పురికొల్పుట రాజు-బాలింగ్బ్రూకున కాఱేండ్లవఱకును నార్ఫోల్కునకు యావజ్జీవమును విదేశవాసమును రాజద్రోహమునకై విధించుట-రాజుదౌర్జన్యమును దలఁచుకొని పలువురు ప్రభువులు రాజుపైఁ దిరుగుపాటు సేయ నిశ్చయించుకొనుట - బాలింగ్బ్రూకు నార్తాంబర్లేండులు సైన్యముఁ గూర్చుకొని రాజసైన్యము నెదురుకొనుటకు సన్నద్ధులైయుంట-బాలింగ్బ్రూకు నార్తాంబర్లేండు యార్కులతోఁ బ్రజలంద ఱేకీభవించి తనసైన్యమును ధ్వంసముగావించుచున్నారని రా జైర్లేండు నుండి వచ్చి విని పరితపించుట-రాజును బాలింగ్బ్రూకును సంధిగావించుకొనుట - రెండవరిచార్డ్డుమహారాజుభార్య తోఁటమాలిచే బాలింగ్బ్రూకుయొక్క యౌన్నత్యమును, రాజ్యభ్రష్టుఁ డౌటకు దటస్థించిన తనభర్తదా దురవస్థను విని పొగలుట - బాలింగ్బ్రూకుని సైనికులన్యోన్యముఁ గలహించుట - బాలింగ్బ్రూకు రిచార్డ్డుమహారాజు న్దనయొద్దకు రప్పించి, కిరీటములాగుకొని, చెఱసాల కంపించుట-చెఱసాలకరుగుచున్న రిచార్డ్డుమహారాజు నతనిరాణి గలిసికొని మాట్లాడి యాపెనుండి తిర్గిబోవుట - ఆమర్లేయుండలి రాజద్రోహము గనిపెట్టి యతనితండ్రి యార్కురాజుతోఁ జెప్పనేగుట - ఆమర్లేరాజునొద్దకుఁ దనతండ్రికంటెఁ దా ముందేగి తన్ను క్షమించుమని రాజు బ్రమాస్యముగా వేఁడుచుండఁగా వలదని యార్కునుచుండఁగా నామర్లేతల్లి వచ్చి రక్షించుమని ప్రార్థించి రాజక్షమాపణ నందుట క్స్టను చెఱసాలనున్న రిచార్డ్డుమహారాజు న్దాఁ జంపించినందుకుఁ బశ్చాత్తాపపడుటయును

(19) మూడవరిచార్డ్డుమహారాజు దుఃఖాంత నాటకమునందు వచ్చు భూమికలు

నాల్గవయెడ్వర్డుమహారాజు

వేల్సుప్రభువగు నెడ్వర్డు కాబోవు నాల్గవయెడ్వర్డుమహారాజు యార్కు ప్రభుఁడగు రిచార్డు వీరుభయులు రెండవరిచార్డుమహారాజునకుఁ గొడుకులు క్లారెన్సుప్రభువగుజార్జి మూఁడవరిచార్డుమహారాజు కాబోవుగ్లోస్టరుప్రభువగురిచార్డును వీరుభయులు రెండవరిచార్డుమహారాజునకు సోదరులు క్లారెన్సుకొడుకగు నొకబాలుఁడు

రిచ్మండుప్రభువునుఁ గాఁబోవు నేడవ హెన్రీమహారాజునగు హెన్రీ

కాంటర్బరీగురువగు బౌర్చియరు

యార్కుగురువు

ఈలీగురువగు మోర్టను

బకింగ్హాముప్రభుఁడు

నార్ఫాల్కుప్రభువు వాని కొడుకగుసర్రేప్రభువును

ఎలిజబెత్తుసోదరుండగు రీవర్సుప్రభువు

ఎలిజబెత్తుమ్మ కొడుకులగు డోర్సెట్టుయజమానుఁడు గ్రేప్రభుఁడును

ఆక్సుఫర్డుప్రభువు

హేస్టింగ్సుప్రభువు

స్టేన్లీప్రభువు

లోవెల్ప్రభువు

సర్రిచార్డురేట్క్లిఫ్

సర్జేమ్సుటైరెలు

సర్త్రామస్వాగను

సర్విలియోకాటిస్బి

సర్జేమ్సుబ్లౌంటు

సర్వాల్టరుహర్బర్టు

చెఱసాలయధికారియగు రాబర్టుబ్రాకెన్బరీ

ఒకగురువగుసర్సువిక్కు మఱియొకగురువును

ఆనీదేవీపరిచారకులగు కుర్టెస్సీలు బర్కేలీ
లండనుపుర్యధ్యక్షుఁడు
విల్లుపైరుయజమాని
నాల్గవయెడ్వర్డుమహారాజుభార్య యెలిజబెత్తు
ఆఱవహెన్రీమహారాజుభార్య మార్గరెట్టు వితంతువు
నాల్గవయెడ్వర్డుమహారాజుతల్లి యార్కుప్రభ్వి
ఆనీదొరసాని హెన్రీమహారాజు కొడుకగు వేల్సుప్రభునకు భార్యయై ముండమోసి మూడవరిచార్డ్మహారాజుఁ బెండ్లాడెను.

మార్గరెట్టు ప్లంటాజెనట్టను క్లారెన్సు పసికూఁతురు— మూడవరిచార్డు వలనఁ జంపఁబడిన రాజపుత్రుల దయ్యములు- ప్రభులు సేవకులు దూత ఋణదాత పౌరులు హంతకులు వార్తావహులు సైనికులు మొదలగువారు. రంగ మింగ్లాండు — కథ.

గ్లోస్టరు తనకురూపముం దలఁచుకొని తన్నెవతెయు వ్వలవదు కావునం దనకు లోకములోఁ బ్రేమించఁ దగిన వస్తువులేదని నిశ్చయించి యెట్లైనఁ గుట్రచేఁ దా రాజ్య మాక్రమింపఁగోరుచు క్లారెన్సుచెఱసాల కంపఁబడుట చూచి యాతనిఁ బైకిమాత్ర మోదార్చి లోన నాతనిఁ బొలయింప నిశ్చయించుకొని యప్పుడేఁ క్రొత్తగాఁ జెఱసాలనుండి విడిపింపఁబడి వచ్చుచున్న హేస్టింగ్సు వలన రాజు మిక్కిలిరోగపీడితుఁడై మంచముపట్టియున్నాఁడని విని క్లారెన్సునిఁ దప్పక చంపించుమని రాజుం బురికొల్పెదననియు, వార్విక్కు చిన్నకొమార్తె నాపెపెనిమిటి న్మఱియు నాపెతండ్రినిం దాఁ జంపినప్పటికిఁ బెండ్లాడెదననియు, రాజుతప్పకచచ్చుననియు, నెడ్వర్డుక్లారెన్సులు మడిసిన పిదపఁ దా లాభ మందవచ్చుననియు, నాలోచించుచు రాజుచెంగటి కేగుచు నడిదారిలో రాజశవము మోచుకొనుచువచ్చిన వారివెంబడి నేడ్చుచుండిన యానీతో సంభాషించి

యీపెభర్త నృతియు నాపితండ్రి న్గాడ దాఁ జంపుట- మఱపించి తనవాక్చమత్కృతిచే నాపె న్దన్ను మోహింపఁజేసి యీపెయొద్దనుండి వెడలి క్లారెన్సును హంతకులచేఁ జంపించుట-ఎడ్వర్డుమహారాజు ప్రియులగు రివర్సుప్రభుని గ్రే ప్రభుని నర్తామసాగనుని గ్లోస్టరు చెఱసాల నుంపించుట - గ్లోస్టరుబకింగాములు యువరాజు నతనితమ్మునితో గూడఁ జెఱసాలనుంచుట - గ్లోస్టరు తాను రాజౌట కొప్పని హేస్టింగ్సును జంపించుట-యువరాజు నతనితమ్మునితోఁ బొలయించుట -ఆనీనిఁ జంపించుట - క్లారెన్సుకొడుకులఁ జంపించుట - బకింగామును జంపింప నుద్దేశించుట - ఎడ్వర్డుమహారాజుపుత్రికయగు నెలిజబెత్తుం బెండ్లాడం దలఁచుట - బకింగాము రాజభటులకుఁ బట్టువడిఁ చంపఁబడుట—మూడవరిచార్డుమహారాజు యుద్ధములో రిచ్మండుచేఁ జంపింపఁబడుట-రిచ్మండు రాజై మూఁడవరిచార్డుం బెండ్లాడనెంచిన యెలిజబెత్తుం బెండ్లాడుటయును

(20) వృథాప్రణయోద్యమము నందలి భూమికలు

నవర్రేరాజగు ఫర్డినుండు

బైరాను లాంగవిల్లి దూమను రాజసచివులు

ఫ్రెంచిరాజు కూఁతుగనిపెట్టుకొను బోయెట్టు మర్కేడట్టు

ఆర్మోడో పిచ్చిస్పెనియార్డు

నాధనీలు పురోహితుఁడు

హోలోఫర్నీసు ఒజ్జ

డల్లు రాజభటుఁడు

కాస్టార్డు విదూషకుఁడు

మోతు ఆర్మెడోభృత్యుఁడు

ఒక యుడవివాఁడు

ఫ్రెంచిరాజపుత్రి

రోసిలైను మేరియా కేతరైను ఫ్రెంచి రాజపుత్రిక చెలికత్తెలు

జాక్వినెట్టా పల్లెటూరిపడుచు అధికార్లు రాజపుత్రికల పరిచారకులు

రంగము నావెర్రిలో — కథ.

రాజులాంగవిల్లీ డూమేనులు మూడేండ్లవఱకు స్త్రీల మొగములు చూడక బ్రహ్మచర్యము చేయుచు విద్యాభ్యాసముచేయుట - కొట్టిడుకొని యందుపకొప్పని బైరనుకి శిక్షవిధించుట - ఫ్రెంచి రాజపుత్రి రోసలైను మేరియా కేతరైను బోయెట్టు రాజులాంగవిల్లి డ్యూమను బైరనులు కలసి ప్రేమ సంభాషణము లాచరించుట - రాజు నతని సవయస్కులను ఫ్రెంచి రాజపుత్రి యామెచెలికత్తెలపైఁ దమ వలపుదెలుపు జాబులు వ్రాసుకొనుచు మన్మథబాణ పీడితులౌట - ఫ్రెంచి రాజపుత్రియు నామెచెలికత్తెలు దమప్రియులు తమకువ్రాసిన జాబులఁగూర్చి యాచ్చటించుకొనుట - రాజు రాజవయస్యులును ఫ్రెంచిరాజపుత్రియు నామెచెలికత్తెలును మాఱువేషములు వేసికొని యొండొరుల మోసపుచ్చుకొనుచు నాటాడి పిదప యథార్థరూపంబుల నన్యోన్యప్రేమలఁ దెల్పుకొనుట - ఫ్రెంచిరాజపుత్రి తనతండ్రి మరణవార్తవిని తనదేశమున కేగుచు నొకవత్సరము తరువాత రాజు న్వైండ్లాడెదనని రాజునుండి సెలవుపుచ్చుకొనుట-రాజవయస్కులును రాజపుత్రి చెలికత్తెలుంగూడ నట్లే యొకసంవత్సరము తరువాత నన్యోన్యము కలసికొన బాసయొనర్చుకొని యొండొరుల నెడఁబాయుటయును.

(21) మేక్బత్తను నాటకమందలి వేషములు

స్కాట్లెండు రాజగు డంకను

మల్కోము డోనల్బేనులు డంకను కొడుకులు

మేక్బత్తు బేన్కోలు రాజసేనానాయకులు

మేసిడల్ఫు వెన్నాక్సు రాస్సు మెన్టీత్తు అంగస్సు కేత్నస్సులు

స్కాట్లెండు లోని ఘనులు

ఫియన్సు బేంక్వోకొడుకు

సివార్డు ఆంగ్లేయసేనానాయకుఁడు

చిన్నసివార్డు సివార్డుకొడుకు

సేటను మేక్బత్తునకు గనిపెట్టుకొనియున్న యుద్యోగి

బోయి మేక్బత్తుకొడుకు

ఒక యాంగ్లేయ వైద్యుఁడు

ఒకస్కాచివైద్యుఁడు

ఒకసైనికుఁడు

ఒకద్వారపాలకుఁడు

ఒకవృద్ధుఁడు

మేక్బత్తుదొరసాని

మాసిడఫ్ఫుదొరసాని

మేక్బత్తుదొరసాని గనిపెట్టుకున్న తగుమనుష్యులు

పాకేటియను మఱిముగ్గురు చిల్లంగి పెట్టుస్త్రీలు ప్రభులు ఘనులు అధికార్లు సైనికులు హంతకులు సేవకులు దూతలు బేకికోదయ్యము తక్కినపీడలు రంగము కొంతయింగ్లాండు కొంతస్కాట్లెండు — కథ.

డంకను నార్వేయుద్ధములోఁ దనకు జయము కలిగించిన మేక్బత్తునకు గొప్పబిరుదిచ్చి యతనియింట విందారగింప నెంచుట-మేక్బత్తు మంత్రికత్తెలచేఁ దా రాజుకాఁబోవు టెఱిఁగి తనభార్యతోఁ దన యింటికే విందుకు రాబోవుడంకనునిం జంపి తా రాజగుట కాలోచించుట-మేక్బత్తు నతనిభార్యయు డంకనుతో నున్నవారికి సురపట్టి నిద్రపట్టించి ద్వారపాలకునకు సేవకులకుఁ గూడ మత్తెక్కించి నిదురించుచున్న డంకనునిఁ జంపి యానెత్తురు నతనిభటుల పైఁజిమ్మి తా పెద్దియు నెఱుంగనట్లు తమగదిలో నుంట-మేక్డఫ్ఫు లెన్నాక్సులు డంకనుచంపఁబడుటకుఁ జింతించుట-మేక్బత్తు నతనిభార్యయుఁ దము

కెద్దియుఁ దెలియనట్లునటించుట-మల్కొముడోనల్బేనులు తమకుఁ గూడ చేటుమూడునేమోయని ఇంగ్లాండునకొకఁడు ఐర్లేండునకొకఁడు పాఱిపోఁగా వారలపై నానింద మోఁపి మేక్బెత్తు రాజగుట-మంత్రికత్తెల వలన బాంకో మఱియు నతనిసంతతియు రాజపదవి నందుననుమాటవిని మేక్బెత్తు బేంకోఫ్లీయన్సుల నతనియింటికి విందుకై రమ్మని నడుదారిలో రాత్రివేళ వారినిరువుర జంపుటకై హంతకుల నేర్పఱచుట-హంతకులు బేంకోనుజంపుట-ఫ్లీయెన్సుతప్పించుకొని పారిపోవుట-మేక్బెత్తు బేంకోదయ్యముభోజనశాలయందు దనకగపడఁగా నసందర్భ ప్రలాపము లాడుట-మఱియు నచట భుజించువారు వెఱగందపోవుట - మేక్బెత్తు తనకు జడిసి ఇంగ్లాండునకుఁ బాఱిపోయినమేక్డఫ్ఫుకుటుంబము నాబాలవృద్ధులం జంపించుట-మాల్కోల్ము మేక్డఫ్ఫు లింగ్లీషురాజి చ్చినసేనతో మేక్బెత్తుపైకి యుద్ధమునకువచ్చుట-స్కాచ్చిప్రజ లనేకులు వారితోఁ గలియుట-మేక్బెత్తుభార్యరోగముచేఁ జచ్చుట-మేక్బెత్తు మేక్డఫ్ఫుచే యుద్ధమునఁ జంపబడుట-మాల్కోల్ము స్కాట్లేండునకు రాజగుటయును,

(22) దెబ్బకుదెబ్బయను నాటకమున వచ్చు వేసములు

విన్సెంటియోరాజు

ఆంజేలో రాజుపరోక్షమున రాజప్రతినిధి

ఎస్కాలసు ఆంజేలోసహకారి

క్లాడియో ఒక యౌవనుఁడు

లూసియో మతముపిచ్చికలవాఁడు

ఇద్దరు తగుమనుష్యులు

ప్రోవోస్టు తోమను పీటర్లు సన్యాసులు

న్యాయాధికారి

ప్రొయెసు

ఎల్బో రాజభటుఁడు

ఫ్రాత్తు అవివేకి
పాంపి ఓవర్డోనుదొరసానిబానిస
అభోర్సను హంతకుఁడు
బార్నార్డీను బందె
ఇస్బెల్లా క్లాడియోకుసోదరి
మెరియానా క్లాడియోకుఁ బ్రధానముకాఁబడినస్త్రీ
జూలియటు క్లాడియోవలపుకత్తె
ఫ్రాన్సిస్కా యోగిని
ఓవర్డోనీ తార్పుగుల్ల

ప్రభువులు అధికార్లు పౌరులు సేవకుఁడు భృత్యులు పరిచారకులు
రంగము వియన్నా యొద్ద రాజు ప్రచ్ఛన్నవేషమునఁ దనప్రజలవర్తన మరయఁగోరి యాంజిలోనుఁ దనకుఁ బ్రతినిధిగాఁ జేసిపోవుట-క్లాడియో జూలియట్టను కన్యకకు గర్భముచేసినందుకు చెఱసాలకుఁ గొంపోఁబడుట-క్లాడియో లూసియోతోఁ దనసోదరి రాజప్రతినిధిం గలిసికొని తన్నురక్షించునట్లు చెప్పుమనుట-ఇస్బెల్లాఫ్రాన్సిస్కా యొద్ద యోగిని యాటకుఁ బరిచర్యసేయుచు లూసియోవల్లఁ దనసోదరిని వర్తమానమును విని యాతనిరక్షింపఁ బూనుట ఆంజీలోక్లాడియోకు మఱునాఁడు శిరచ్ఛేదముచేయుట కాజ్ఞాపించుట ఆంజీలోయిస్బెల్లాను మోహించి యామె తనకోర్కె తీర్చినయెడ నామెసోదరుని రక్షించెదనని యామెతోననుట-రాజు సన్యాసివేషముతోఁ దనమానము చెఱుచుకొనినైనను దన్ను రక్షించుమని ప్రార్థించు నహోదరుని రక్షించుటకై యమర్యాద పొందనొల్లనియిస్బెల్లాతో జెండ్లికై మాట్లాడి మానమున మేరియాను విడనాడిన యాంజిలోను కొడంబడి యాతనికోర్కె నొంటిగ నడురేయిం దీర్చెదనని నమ్మించుమనియుఁ బ్రమాదము రానీక తానుఁగాపాడెదననియు జెప్పుట-రాజు మేరియానాతో నిస్బెల్లానుసమకూర్చి యిస్బెల్లాకు మాఱుగా మేరియానా ఆంజిలోతో

నడురేయి చీకటిలో నా తండేర్పర్చిన పూఁదోటలోఁ మౌనమున సంభోగించుట కొప్పించుట - చెఱశాలలో నాటిరాత్రి నాల్గు గంటలకుఁ దప్పక క్లాడియోశిరస్సును నరికించవలయునని ప్రొవోస్టున కాంజీలోయంపిన యాజ్ఞను రాజువిని ప్రోవోస్టుతో నదివఱకుఁ దనకుఁ గల పరిచయమునుఁబట్టి క్లాడియోతలకుమాఱుగా నదివరకే జ్వరముచేఁ జెఱసాల మృతుండగు నొకనితల నతికి యాంజీలోనికిఁ జూపించుమని రాజు తనకిచ్చిన యాజ్ఞచూపించి రాజు రెండుదినములలో నచటికివచ్చు నీసంగతి యంతవఱకు మఱుగుపర్చుమనియుఁ దా నెల్లవిధముల నతనిఁ గాచెదనని యొప్పించి తనసోదరునకు క్షమాపణ పత్రిక వచ్చునేమోయని కనుఁగొనవచ్చిన యిస్బెల్లాతో క్లాడియోతల నఱుకఁబడి యాంజీలోనొద్ద కంపఁబడెననియు, మఱి విలపించిన సార్థకములేదనియు, రాజు మఱునాడు రానున్నాఁడనియు, నీవపుడు తా నిడిన యుత్తరమును బీటరునకు జూపుమనియుఁ, జెప్పి పంపుట లూసియో ప్రచ్ఛన్నవేషముననున్న రాజుతో రాజవివేకి యనియుఁ, దా మోసకాఁడనియుఁ దెల్పుట-ఆంజీలో మఱునాడు తన్మారి వెలుపలఁ గలసికొమ్మను రాజాజ్ఞనుఁ జదివికొని క్లాడియోను బ్రతుకనిచ్చినచో నతఁ డాపెసోదరిం జెఱచినందుకుఁ దనపైఁ బగఁ బట్టునేమోయని శంకించి యతనిం జంపించినందుకు నొచ్చుకొనుట-రాజు తనయథార్థరూపముతోఁ బీటరునిం గలిసికొని యతనికిఁ గొన్ని యుత్తరము లిచ్చి యవి వలసినపుడు తనకిమ్మని చెప్పి వెలింటినస్సు రోలెనడు క్రాసను వెరియస్సులఁ దనయొద్దకు రప్పించుమని యుత్తరమిడుట రాజుసభచేసి యాంజీలోనికి మేరియాను క్లాడియోకుజూలి యట్టును దనకి స్బెల్లాను భార్యలంగా జేయుటయును

(23) వెన్నిసువర్తకుఁడను నాటకమునందలి భూమికలు

వెనిస్ప్రభువు

మొరాకోయారగాను రాజులు పోర్షియాను వలచినవారు

ఆంటానియో వెన్నిస్వర్తకుఁడు బెసానియో యతనిచెలికాడు పోర్షియా వలచినవాడు

గ్రాటియానో సలానియో సలారినో సలేరియా ఆంటియానో బెసేనియో లకుమిత్రులు

లోరెంజో జస్సీకాను వలచినవాఁడు

షైలాకు వకయూధుఁడు

టూబలు షైలాకుని హితుఁడు

గొబ్బో మొదట షైలాకునకు సేవకుఁడై పిదప బెసానియోకు సేవకుఁడైన విదూషకుఁడు

ముసలిగొబ్బో లాన్సిలట్టునకుఁదండ్రి

బల్తజరు స్టీఫానో పోర్షియాకు సేవకులు

పోర్షియా యొకభాగ్యవంతునికూఁతురు నెరిస్సా యాపె చెలికత్తె

జస్సీకా షైలాకు కూతురు

వెన్నిస్భాగ్యవంతులు న్యాయాధికారియుద్యోగులు కారాగృహాధికారి పోర్షియా సేవకులు మఱియుఁ దక్కుఁబరిచారకులు రంగము కొంత వెన్నిసులో మరికొంత బెల్మొంటులోను—కథ.

షైలాకునకాంటియో తనమిత్రుఁడగు బెసానియో దూరదేశముననున్న పోర్షియాను జూచివచ్చునిమిత్తము కోరినచోఁ దనయొడలి మాంస మఱిసేరిచ్చుట కొడంబడిక వ్రాసి మూఁడువేలవరహా లప్పు తీసికొనుట జస్సీకాలోరెంజోను వలచి యతనితోఁ దనతండ్రి ధనమునుఁ గొంతహరించి పారిపోవుట షైలాకు తనకొమార్తె పోకకు వగచుట-మఱియు నాంటానియో యోడలు నష్టమైనందుకు సంతసించుట బెసానియో పోర్షియానుఁ జేబట్టి యాపెవలన నెవ్వరికైన నీఁబోనని మాట యిచ్చి యొకయుంగరముం బుచ్చుకొని యాంటనియో తన్నుఁ దక్షణము రమ్మని వ్రాసినజాబు చదువుకొని యతనికిఁ దటస్థించినయాపద పోర్షియాకుఁ జెప్పి స్వదేశమునకు నెరిస్సాను వరించిన గ్రాంటియా

నోతో నరుగుట-పోర్షియా నెరిస్సాలు మగవేషములతో వెన్నిస్సు
పురమునకేగి న్యాయస్థానమున మాంసముకోయ నెత్తురుం రాగూడ
దనియు, నొకమనుష్య జీవముం దుర్మార్గముగాఁ దీయనెంచినవాని
యాస్తిలో సగము రాజునకుం దక్కు సగ మామనుష్యునకు ప్రాపల
లయునని పద్ధతిచూపించి యాంటియోనుఁ గాపాడి రాజుచేఁ మెప్పొంది
బెసానియోకుఁ దానిచ్చిన యుంగరము నుపాయమతిగాఁబొంది యింటికి
వచ్చి వెంటనే వచ్చినబెసానియోతో ముచ్చటలాడుచు నచట బెసా
నియోతో వచ్చినయాంటియోనోతో నతనియోడలు సేమముగా రేవు
చేరినవని సంతోషవార్త చెప్పుట నెరిస్సాకూడ తన నాథునిఁ గలసికొని
సుఖించుట-లోరెంజో జస్సీకాలు పోర్షియో చేసిన యేర్పాటుచే
షైలాకునియాస్తికి యజమానులగుటయును.

(24) విండ్సర్వేడుకకత్తెలను నాటకమునందలి వేషములు

ఫాల్స్టాపు
ఫెన్టను ఒకపడుచువాఁడు
షాలో పల్లెటూరిన్యాయాధికారి
స్లెండరు షాలోకు దాయాది
ఫార్డు పేజీలు విండర్సులోని తగు మనుష్యులు
విలియంపేజీ పేజీకొడుకులు
ఈవన్సు వెల్షుపురోహితుఁడు
కేయసు ఫ్రెంచివైద్యుఁడు
సత్రాధికారి
బార్డలుఫు నిమ్టలు పిస్టోలు ఫాల్స్టాపునివెంటనుండువారు
రోబిను ఫాల్స్టాపుని సేవకుఁడు
సింపిలు స్లెండరునిభృత్యుఁడు
రగ్బి కేయసుని సేవకుఁడు
ఫార్డుదొరసాని

పేజీదొరసాని ఆపెకొమార్తెయగు పెనీ
క్విక్లీదొరసాని కేయుసునకు సేవకురాలు
పేజీఫోర్డుల సేవకులు రంగము వింద్సరు మఱియు దానిచుట్టుపట్లు—కథ.

ఫోర్డుదొరసానిని ఫాల్స్టాపువలచి సందేశమంపుట-ఫోర్డుదొర తనభార్య ననుమానించి బ్రూకను పేరుపెట్టుకొని ఫాల్స్టాపుతోఁ బరిచయముచేసి తనభార్యసిద్ధిఁ గనిపెట్టుచుంట - ఫోర్డుదొరసానియు క్విక్లీదొరసానియు ఫాల్స్టాపుదౌర్జన్యమునకుఁ దగు శాస్తిఁజేయఁ గుట్రవన్నుట-క్విక్లీదొరసాని ఫాల్స్టాపు చెంతకేగి ఫోర్డుదొరసానియు, పేజీదొరసానియు నతనియుత్తరములు చూచుకొని యతని వలచి యున్నారనియుం, దరుచు నాయిద్దరియొద్దకు నతనిసేవకు నంపుచుండు మనియు సపరిహాస్యముగాఁజెప్పుట-బ్రూకను పేరుపెట్టుకొని తనయొద్దకు వచ్చిన ఫోర్డుమాటలనమ్మి ఫాల్స్టాపు తన్ను ఫోర్డుదొరసాని పదివదు నొకండు గంటల మధ్యరమ్మన్నదని చెప్పగా ఫోర్డుదొర తనభార్యపై మఱింత యనుమానపడి యాసంగతి కనిపెట్టుటకుఁ ద్వరపడుట-ఫాల్స్టాపు ఫోర్డుదొరసానితో మాట్లాడుచుండగా నాపె తనపై ననుమానపడి, తనసంగతి శోధించుటకై కొందఱి తగుమనుష్యులతో వచ్చుచున్నాఁడని పేజీదొరసాని చెప్పఁగా విని దిగులుపడుచున్న ఫాల్స్టాపు నొకగంపలో నిఱికించి వానిపై మైలగుడ్డలుకప్పి యేటిలో నాగంప పడవైచిరండని తనసేవకుల కాజ్ఞాపించుట-ఫోర్డు తనయింట నెవరు లేకుంటఁ జూచి సిగ్గుపడి భార్యను-క్షమాపణము వేడుకొనుట పేజీదొరసానియు ఫోర్డుదొరసానియు ఫాల్స్టాపునకు క్షమాపణ వ్రాసి కొని యింకొకసారి యెనిమిదిగంటలకు రమ్మనిక్విక్లీదొరసానిచే వర్తమానమంపుట-ఫాల్స్టాపుఫోర్డుదొరసానియొద్దకు వెళ్లెదనని బ్రూకుతోఁ జెప్పి యాపెతో మాట్లాడుచు ఫోర్డుదొర వచ్చుచున్నాఁడని పేజీదొరసాని చెప్పఁగా జడసి యాస్త్రీలు తనకు ముసలియాఁడు వేసము వేయగా నిలువదలిపోవుచు ఫోర్డుదొరచేఁ దావులుతినియు బయల్పడక

తప్పించుకొనుట-ఒకవిధమైన యాటలో ఫాల్స్టా నందఱిచేఁబట్టుపడి నవ్వఁబడుట-ఫెంటనుతనయుపాయముచే నేనీఁ బెండ్లాడుటయును.

(25) నడివేసవిరేయి కలయనునాటకమందలి వేసములు

ఎథెన్సు ప్రభువగుథీసను

ఈగను హెర్మియాతండ్రి

లైసాండరు డెమిట్రియసులు హెర్మియానువలచినవారు

ఫైలాస్ట్రేటు థీసనుని వేడుకలకధిపతి

క్విన్సు వడ్రంగి

స్నగ్గు కొయ్యపనిచేయువాఁడు

బొట్టమ్ము సాలెవాఁడు

ఫ్లూటీ కొల్మితిత్తులుబాగుచేయువాఁడు

స్నౌటు కంచరి

స్టార్వెలింగు కుట్టుపనివాఁడు

హిప్పోలీటా థీసనువ్వరించుకన్య

హెర్మియా లైజాండరువ్వలచుకన్య ఈగనుపుత్రి

హెలీనా డెమెట్రియసునివలపుకత్తె

ఒబీరను గంధర్వరాజు

టీటేనియా గంధర్వరాజ్ఞి

పక్కు-

పీసు కాబ్వెబు మోతుమస్టర్డులు గంధర్వస్త్రీలు - గంధర్వరాజ రాజ్ఞుల సేవకులగు గంధర్వులు థీసనుహిప్పోలీటాలభృత్యులు రంగము ఆథెన్సు మఱి యాచెంగటియడవియు.— కథ.

హెర్మియాతండ్రి డెమిట్రియసుని బెండ్లాడుమనగాఁ నాపె యొప్పక లైజాండరునిఁ బెండ్లాడఁగోరినపుడు తండుసకంగీకరింప కాతండ్రి రాజుఁజెప్పఁగా, రాజు తండ్రియిష్టానుసారము నడువని కన్యకకు మరణముగాని సన్యాసినీత్వముగాని శిక్షయని నుడువఁగా నాపె డెమిట్రి

నిను మోహించిన తనస్నేహితురాలగు హెలీనాతోఁ దనవర్తమానము
చెప్పి లైజాండరుతోఁగూడ నాథెన్సుపురమునుండి పారిపోదలంచుట-
కిన్సున్నగ్గు బొట్టమ్ముఫ్లూటీ స్నౌటు స్టార్వెలింగులు రాజునెదుట నొక
నాటక మాడఁదలంచుట-హెర్మియాకై యడవికేగెడు డెమిట్రియసు
వలదనుచుండ, హెలీనా వెంబడించి యొక యడవిలోఁ దను దప్పించు
కొనిపోయిన డెమిట్రియసుని వెదకుచు హెర్మియా చెంత నిదురించు
లైజాండరునిఁగాంచుట-లైజాండరు గంధర్వులు తన కనులకు రాసిన
పుష్పరసమహిమచే నిద్దురమేల్కాంచి తొల్తఁ దనకుఁగన్పడు హెలీ
నాయందు మోహపడి యామె న్వెంబడించుట - హెర్మియా తన్నొద
లాసిన లైజాండరుని వెదకుకొంచుఁదలడిల్లుట లైజాండరున్న యడవి
లోఁ గంధర్వరాజ్ఞి తనకనుల రాయఁబడిన పుష్పరసమహిమచే నిద్దుర
లేచి యెదుట నాటకమును వల్లించుచున్న బొట్టమ్మున్వలచి తనవశమున
నుంచుకొనుట-డెమిట్రియసు హెర్మియానుంజూచి బతిమాలి యామెచే
దిరస్కరింపఁబడి నిదురించు పుష్పరసమహిమచే మేల్కొని తనయెదుట
నున్న హెలీనాను మోహించుట-డెమిట్రియసు లైజాండర్లు హెలీనా
కై పరస్పర ద్వేషమూనుట - హెర్మియా హెలీనాలు కలహించుట-
డెమిట్రియసు లైజాండర్లు ద్వంద్వ యుద్ధముకై పూనుట-హెర్మియా
హెలీనా లన్యోన్యద్వేషముతో నొండొరు నెడయుట-గంధర్వ మా
యచే నానల్వురు నిదురించుచు వేటకువచ్చిన థీసనుచే మేల్కొల్పఁబడి
గంధర్వమాయఁ దొలఁగి తొల్లింటి ప్రేమలంబొంది పెండ్లి చేసికొని
సుఖముంటయును.

(26) ఉత్తగడబడయను నాటకమందలి వేసములు

పెట్రో ఆరగన్పిభువు
జాను వానిసోదరుఁడు జారజుఁడు
క్లాడియో ఫ్లారిన్సుపడుచువాఁడు
బెనిడిక్కు పాదువా పడుచువాఁడు

లియోనెటో మెస్సీనాపాలకుఁడు ఆంటోనియో వానిసోదరుడు
బల్తజరు పెద్రో సేవకుఁడు
బొరాచియో కన్రేడులిర్వురుజాను వెంబడివారు
డాగ్బెర్రి వర్జిసులిద్దరధికార్లు
ఫ్రాన్సిను సన్యాసి
ఒకయధికారి
ఒక సేవకుఁడు
హీరో లియోనెటో కూఁతురు
బీట్రిసీ లియోనెటో మేనఁగోడలు
మార్గరెటు ఉర్సూలాలిద్దరు హీరోచెలికత్తెలు దూతలు కాఁవలివాం
డ్రు భృత్యులును రంగము మెస్సీనా — కథ.

యుద్ధమందు విజయమందిన క్లాడియో బెనిడిక్కులు లియోనెటో యొద్ద నున్న హీరో బీట్రిసీలతో మాట్లాడుట క్లాడియో హీరోను మోహించుట-బెనిడిక్కు బీట్రిసీలు విరసములాడుకొనుట - లియోనెటో యింటి విందారగించి, యీనాటకమునఁ బేర్కొన్న (స్త్రీ) పురుషులొకరి వేస మొకరూని యాటపాటల న్వినోదించి సంభాషించుకొనుట-హీరోను క్లాడియోకుఁ బెండ్లి సేయుటకు పెద్రోలియోనెటోలు నిశ్చయించుట-బెనిడిక్కు బీట్రిసీ లన్యోన్యనిగూఢ మోహములఁ దలడిల్లుట జానుబొరాచియోక్రనేదులచేఁ గుట్రపన్నించి గుడిలో హీరోనుఁ బెండ్లాడ సిద్ధపడిన క్లాడియోతో హీరో గతరాత్రి యొంటిగంట యందున నొకపురుషువానితో గిటికీలోనుండి మాట్లాడుచుండెననియు, నాపె కులటయనియుం జెప్పి యొప్పించి, నల్వురులో నతనిచే హీరోనుఁ దూలనాడించుట-హీరో క్లాడియో తన్నుఁ దిరస్కరించుటకు సైఁపక బిట్టు మూర్ఛిల్లుట-అంద తేగినదిదప లియోనెటో సన్యాసి బీట్రిసీ బెనిడిక్కులు హీరో మృతిచెందినట్లు ప్రచురింపనిశ్చయించుట-బీట్రిసీ బెనిడిక్కును క్లాడియోనుఁ జంపుటకుఁ బురికొల్పుట-క్లాడియో హీరో

యపరాధరహిత యని తెల్పఁబడి దుఃఖించుట-లియోనెటో హీరోను సరిగాఁబోలిన తనసోదరుని కుమార్తెని క్లాడియో పెండ్లిచేసికొనుట - కతనినొప్పించి హీరో సతనికగపర్చి యథాస్థితియంతయు వెల్లడించి సల్యూరిలో సతని కాపె స్పెండ్లి యొనర్చుట - బెనిడిక్కు బీట్రిసీలు పెండ్లాడుట-ప్రెడ్రో జార సోదరుడు తగినట్లు శిక్షింపఁబడుటయును

(27) ఒథెల్లోయను నాటకమునవచ్చు వేసములు

వెన్నిసురాజు

బ్రాబంటియో రాజ్యాధికారి తక్కునధికారులు

గ్రాంటియానో బ్రాబంటియోసోదరుఁడు

లోడోవికో బ్రాబంటియోజ్ఞాతి

ఒథెల్లో వెన్నిసు రాజకీయోద్యోగియగు సిద్ధి కేషియో అతనిక్రింది యుద్యోగి అయాగో అతనిజండామోయువాఁడు

రోడిరిగో వెన్నిసుఘనుఁడు

మొంటానో సైప్రసురాజ్యమున నొథెల్లోకంటె పూర్వోద్యోగి

విదూషకుఁడు ఒథెల్లో సేవకుఁడు

డిస్డెమోనా బ్రాబంటియోకూఁతురు నొథెల్లోభార్యయు

ఎమిల్లా అయాగోభార్య

బయంకా కేషీయో యుంపుడుకత్తె

నావికుఁడు దూత వార్తావహుఁడు అధికార్లు ఘనులు గాయకులు సేవకులు రంగము మొదటియంకము వెన్నిసు తక్కిన నాటకమంతయు సైప్రసుదండలి యోడరేవు — కథ.

యాగోరోడరిగోలు ఒథెల్లోను ద్వేషించి యతఁడు డిస్డెమోనా నెత్తుకొనిపోయి పెండ్లిచేసికొన్నాఁడని బ్రాబంటియోకుఁ దెల్పుట - బ్రాబంటియో రాత్రియొంటిగాఁ దనతోఁజెప్పక యొథెల్లోనుఁ దగులుకొనిపోయిన తనకూఁతు న్వెదకి యొథెల్లోను నిష్ఠురములాడుచు నతనిఁ బిల్వవచ్చిన రాజభటులతోఁగూడ రాజసభకుఁబోయి

యొథెల్లో యొనర్చిన దౌర్జన్యము న్రాజుతోఁజెప్పుట - రాజు డిస్డెమోనా యంగీకారముం దెలిసికొని యొథెల్లో కామె నప్పగించి యాతని సైప్రసుయుద్ధమున కంపుట - అయాగోరోడరిగోలు కేషీయోనుఁ ద్రాగించి సైప్రసుప్రజ కతనిపై ద్వేషముపుట్టించుట - కేషీయోను ఒథెల్లో యుద్యోగమునుండి తప్పించుట - అయాగో డిస్టెమోనాను కేషియో వేడుకొని తిరిగి యుద్యోగమును సంపాదించుకొను నుపాయము కన్ని యాతనికి దనభార్యను సాయపడఁ బ్రేరేపించుట - డిస్టెమోనా తనభర్తతో కేషియోపై నల్కమానుమని పలువిధములఁ బ్రార్థించుట - అయాగో యొథెల్లోకు డిస్డెమోనా కేషియో లన్యోన్యమోహముల నున్న ట్లనుమానము పుట్టించుట - డిస్డెమోనా కొథెల్లో పెండ్లియాడిచ్చిన చిఱురుమాలుం దనభార్యచే నయాగో తెప్పించుకొని కేషియో యింట జాఱవిడిచి డిస్డెమోనా కేషియోను వలచి యతని కారుమా లిచ్చినదని చెప్పుట - ఒథెల్లో డిస్డెమోనా నారుమాలడిగి యాపె యదెట్లోపోయెనని చెప్పుటకు మఱింత యాపెపై ననుమానించుచు నయాగో దౌర్జన్యముచే నిశ్చయముగా డిస్డెమోనా కేషియోలకు దుస్సంబంధమున్నదని నిర్ణయించుకొని వారలం బొలయింప నిశ్చయించుట - ఒథెల్లో రాజునొద్దనుండి సైప్రసునందలి తనయధికారము కేషియో కొసఁగి తన్ను వెన్నిసునకు రమ్మను నాజ్ఞ లోడోవికోనుండి పుచ్చుకొని చదువుకొనుచు చెంతనున్న తనభార్యపై మండిపడి యాపెకుఁ జెంపకాయకొట్టుట - అయాగో డిస్డెమోనాతో సంభోగించఁజేసెదనని రోడరిగోను భ్రమపెట్టి యాతనినుండి డిస్టెమోనాకొఱకని సొమ్ములు పుచ్చుకొనుచుఁ దుద కాతనినిఁ గేషియోనుఁ జీఁకటిరాత్రియందు నఱుకుటకుఁ బురికొల్పగాఁ గేషియోరోడరిగో లన్యోన్య శస్త్రక్షతులు కాఁగాఁ దా కేషియో కాలు నఱికివైచి రోడరిగోనుఁ జంపి యెవరో దుర్మార్గులీపని చేసినారని నల్వురిలోఁ జాటుట - ఒథెల్లో సగము నిద్దురనున్న తనభార్య

న్లేపి కేషియోతో వ్యభిచరించితివా యని నిష్ఠురములాడి యాపె యెంత బతిమాలి తన నేరములేమి తెల్పినను వినక తుద కాపె మెడ పిసికి చంపుట-ఎమిల్లా యీహత్యం గాంచి డిస్డెమోనా నిష్కల్మషయనియు, నయాగో యన్యాయముగా నాపెయందుఁ బాపము పన్ననినియు స్పష్టముగా నందఱిలో వెల్లడించుట - అయాగో తనభార్యను సహింపక పొడిచిచంపి పరుగిడుట - ఒథెల్లో తా నన్యాయముగఁ దన భార్యం జంపుటకువగచి పొడిచికొని చచ్చిపోవుట - లోడోవికో యయాగోసునకుఁ జిత్రవధ విధించి కేషియోను సైప్రసున కధికారిఁ గావించుటయును.

(28) పెరిక్లీసను నాటకమందలి వేసములు

ఆంటియోకసు ఆంటియోకసురాజు

పెరిక్లీసు టైరుయువరాజు

హెలికానసు ఎస్కానీలు టైరుయొక్క యిద్దరుఘనులు

సైమోనుడీసు పెంటాపొలిసురాజు

క్లియోను టార్సనుపాలకుఁడు

లైసిమేకసు మిటిలెనీ పాలకుఁడు

సీరిమను ఇఫీసస్ప్రభువు

తలియార్డు ఆంటియోకసు నందలి యొకప్రభువు ఇతని సేవకుఁడు ఫిరీమను

లియోనైను డయోనిజా సేవకుఁడు

సేనాధిపతి

ఒక బడవా వాని సేవకుఁడు

ఆంటియోకసు కూఁతురు

డయోనిజా క్లీను భార్య

తైసా సైమోనుడీసు కూఁతురు

మెరినా పెరిక్లీసు తైసాల కూఁతురు

లైకొరిడా మెరీనా దాది

ఒకకుంటెనకత్తె
ఒక పాతివ్రత్యదేవత
పల్లవి పాటకుఁడు

ప్రభువులు దొరసానులు శూరులు ఘనులు నావికులు నౌకా తస్కరులు బెస్తలుదూతలు రంగము నానా దేశములందు—కథ.

తనకుమార్తెతో గూఢముగా సంభోగించు నాంటియోకసుఁ డామెను వరింపవచ్చువారల కొక విడికత బొడిచి యందు కుత్తరవీయఁ జాలని వానినెల్ల జంపించుట - పెరిక్లి సావిడికథకు సమాధానము సూచించి తన్నాంటియోకసు చంపించునేమోయని జడిసి పారిపోవుట- ఆంటియోకసు పెరిక్లిసుం జంప థాలియార్డునంపుట - పెరిక్లి సాంటియోకసు తనరాజధానిపై దండెత్తి ప్రజాపీడన మొనరించి తను ద్దంపునని శంకించి తారసస్సనకుఁ బారిపోవుట- థాలియార్డు టైరులో పెరిక్లిసు లేకుంటఁజూచి తిర్గి తనదేశమునకేగుట- క్లియోనుడయోని జాలు తనదేశమునఁ బెట్టిన కరువునకై తిండిలేక వగచుచుండఁగా పెరిక్లిసు వారలకు సమృద్ధిగాఁ దనయోడలోని భోజనసామాగ్రి యిచ్చుట - పెరిక్లిసు పెంటాపొలీసునకు గాలివానతాఁకునఁ దన యోడలు చెడఁగా సముద్రమునఁ గొట్టుకొని వచ్చి యచటిరాజగు సైమోనుడీసుని యనుగ్రహము వడయుట - టైరునందలి ఘనులు పెరిక్లిసుని వెదకుటకై సముద్ర యానముచేయుట - పెరిక్లిసు థైసాను నామె తండ్రి యిష్టానుసారమునఁ బెండ్లాడుట - పెరిక్లిసు థైసాతో మఱియు నామెయందుఁ దాఁగన్న కొమార్తెతో టైరున కాంటియోకసు కూఁతుతోఁ జచ్చుటవిని యోడపై వచ్చుచుఁ దుపానునఁ యోడ చెడఁగా నాలుబిడ్డలనుండి విడఁబడుట- పెరిక్లిసు మృతిచెందినదని తనభార్య నొకపెట్టెనుంచి యందుపై నామెస్థితివ్రాసి సముద్రమున విడువఁగా దానిని సెరిమనుపట్టుకొని యందు సజీవురాలైన థైసాను గాపాడుట - పెరిక్లిసు మెరినాపై కొరీడాలను క్లీను చెంతనుంచుట -

మెరీనా తెల్వితేటలకు డయోనిజా యోర్వక లైకోరిడా మృతికి వగచు నాపె జంపుటకై లియోలైనున కప్పగించుట - నౌకా తస్కరులు లియోనైనునిఁ బాఱఁదఱిమి మెరీనానుఁ దమవశమున నుంచుకొని మిటిలేనియను పురమున నాపె నొకబడవాకమ్ముట - మెరీనా వేశ్యా వృత్తి కొప్పక చటిపాలకుని సంరక్షణమున నాటపాటలచే గౌరవ ముగా జీవించుట - పెరిక్లిస చటికి వచ్చి తన యోడలోని కచటి పాలకునిఁ చేఁ దనతో మాట్లాడుటకు రప్పింపఁబడిన మెరీనా సమాచారము న్దెలిసి కొని యాపెను బోల్చి సంతసించుట - పెరిక్లిసు తనకుఁ బాత్రివత్య దేవత కలలోఁ జెప్పిన ట్లెపెసస్సు నందున్న యాపె గుడికేగి యచటఁ దన భార్యఁ గాంచి యాపె చరిత్రము న్విని తనకూతుఁ లెసిమేకసునకుఁ బెండ్లి చేసి తన రాజ్యమున భార్యతో సుఖముండుటయును.

(29) రోమియో జూలియట్టులను నాటకమందలి వేసములు

ఎస్కాలసు పెరోనారాజు పేరిసు రాజబంధువుఁడు
మాంటేంగు కేపులట్టులనో్యన్య ద్వేషమూను నిద్దఱుఘనులు
కేపులెట్టు పినతండ్రి
రోమియో మాంటేంగుకొడుకు
మర్క్యూషియో రోమియోమిత్రుఁడగు రాజబంధువు
బెన్వోలియో రోమియోమిత్రుఁడగు మాంటేంగుభాతృవ్యుఁడు
టైబల్టు కేపులెట్ట దొరసాని మేనల్లుడు
లారెనస్సు జానులుసన్యాసులు
బల్తసరు రోమియో సేవకుఁడు
పీటరు సెంప్రన్ గ్రికరీలు కేపులెట్టు సేవకులు
అబ్రహాము మాంటేంగు సేవకుఁడు
వైద్యుఁడు
ముగ్వురుగాయకులు
ఇద్వురు భృత్యులు ఒకయధికారియు

మాంటేంగుదొరసాని
కేపులెటు దొరసాని
జూలియట్టు కేపులెట్టుకూఁతురు

జూలియట్టుదాది వెరోనాపౌరులు మాంటేంగుకేపులెట్టుల జ్ఞాతులు వేషధారులు భటులు దౌవారికులు భృత్యులు పల్లవి-తంగము నామంటువాలు— కథ.

మాంటేంగు కేపులెట్టుల జనులు కలహమాడుచుండగా రాజు వారలఁ వారించుట-రోమియో కేపులెట్టింట జరుగు విందునకుఁ బోయి ప్రచ్ఛన్న వేషముతోనుండి జూలియట్టుతో మాట్లాడుట-జూలియట్టురోమియోను వలచి యతఁడు తనతండ్రి విరోధి యౌటకుఁ జింతించుట-రోమియోజూలియట్టున్న మేడ చెంతకు గోడదాఁటి దిగి చెట్టుచాటునఁ బొంచియుండ నామె మేడకిటికి యొద్దఁ గూర్చుండి రోమియోనుఁ జేర్కొని తలడిల్లుచుండ నతఁడు తన్ను బైలుపర్చుకొన నామె యతనితో మాట్లాడి మఱునాఁడు తొమ్మిదిగంటలకు వర్తమాన మంపెదనని చెప్పిపోవుట-రోమియో గుడియొద్దనున్న సన్యాసి యొద్దకుఁ బోయి జూలియట్టుం దనకుఁ బెండ్లి సేయుమని చెప్పి యదివఱకుఁ దావలచిన రోసెలినుపై వలపుఁ దాఁదొలఁగినందున కతనిచే జీవాట్లుతినుట-జూలియట్టు తనదాది ద్రోమియోచెంత కంపియు నతని వర్తమాన మెఱిఁగి రహస్యముగా గుడిలో లారెన్సుచెంత నతనిఁ బాణిగ్రహణము చేసికొనుట-తనహితుఁడగు మార్క్యూషియో చంపి రాజునకు జడిసి పలాయితుఁ డౌట రాజు రోమియోకు విదేశవాసము విధించుట-రోమియోతో జూలియట్టు తెలవాఱువఱకు సల్లాపసుఖ మనుభవించి, సెలవుతీసికొనిపోవుట-జూలియట్టు తలదండ్రు లాపెకు పేరిస్సుతో రెండుదినముల గడువులోఁ బెండ్లిచేయ నిశ్చయించుట-జూలియట్టులారెన్సు నొద్దకేగి యటనున్న పేరిసు వ్యర్థోచిత ముగ

మాట్లాడి పంపి రహస్యముగా లారెన్సున్గర్తవ్యమడిగి యతఁడు తన
కొసఁగిన యొకవిధమగు సమ్మోహనౌషధమునుఁ దీసికొనిపోవుట-
జూలియట్టు బంధువులచేఁ బాధ్యఁబడుట-తన సేవకుడువచ్చి జూలి
యట్టు మృతి చెంది సమాధినుంచఁబడినదని విని రోమియో యొక
వైద్యునకు ధన మొసఁగి విషముకొని జూలియట్టున్న సమాధి కడ
కేగుట-లారెన్సురోమియోయొద్దకు వర్తమాన మంపుటకు మనుష్యుఁడు
దొరకకుంటకుఁ గించునుపాయ మరయుచుంట - రోమియో జూలియట్టు
సమాధిచెంత పూలుచల్లుచున్న పేరినిస్సుం జంపి జూలియట్టున్న
పెట్టెం దెఱచి యామె న్ముద్దుగొని యామె మృతిచెందుట కోర్వక
విసము గ్రోలి చచ్చుట-జూలియట్టు మత్తువిఱిగినపిదప లేఁచి తనకయి
విసముఁగ్రోలి మృతిచెందిన తననాథునిఁ జూచి యతనిచేతిలోనున్న
కైజారుపుచ్చుకొని చచ్చుట-రాజు జరిగిన సమాచార మంతయును
లారెన్సువలన విని మాంటేగు కేపులెట్టులతో విచారించుట-యును

(30) పంకెన్మచ్చిక చేయుట యును నాటకమున వచ్చు వేసములు

ఒక ప్రభువు స్టైన్ (కంచరి) పూఁటకూళ్ళమ్మ సేవకుఁడు నాటకులు

వేటకాండ్రు భృత్యులు

బేస్లిసా పాడువాలోని శ్రీమంతుఁడు

విన్సెంటియో స్టైజాలోని ముసలివాఁడు

లూసెంటియో యతనికొడుకు

పెట్రూషియోఁ కేరీనానువరించు వెరోనాపురుఁడు

గ్రీమియో హార్టెన్సియోలుఁ బయాన్కాను వలచువారు

ట్రానియో బయండెల్లోలు లూసేంటియో సేవకులు

గ్రూమియోకర్టిస్సులు పెట్రూషియో సేవకులు

ఒక పండితమ్మన్యుఁడు

కేతరీనా బయాంకా వితంతువులు బేప్టిస్టాకూఁతులు

కుట్టుపనివాఁడు దుస్తులమ్ముకొనువాఁడు బేప్టిస్టా పెట్రూషియోల సేవకులు

రంగముపాడువా పెట్రూషియో యిల్లు ప్రభువు త్రాగి పడియున్న స్లైనునకుఁ ప్రభువేషమువేసి వానికిఁ ప్రభుఁడను భ్రమగల్పించి వానియెదుటఁ బెంకెన్మచ్చిక సేయుట యను నాటకమాడించుట— కథ.

పాడువా యనుపట్టణమున బేప్టిస్టాయను నొక ధనవంతుఁడు కలఁడు-వానికి ముగ్గురుకూఁతులందు కేతరీనా బయాంకాలు కన్యకలు-దక్కినదివితంతువు - కేతరీనా మిగులగయ్యాళి యాపెకుఁ బెండ్లియైన పిమ్మటఁగాని బయంకాకు బెండ్లిసేయవని యాపెతండ్రి నిశ్చయించెను - పెట్రూషియో యనువాఁడు తననేర్పుచే కేతరీనాను మచ్చికచేసి పెండ్లిచేసుకొని సాదుగావించెను - బయంకాను లూసెన్షియో వితంతువును హార్డెన్షియో పెండ్లాడిరి.

(31) గాలివానయను నాటకమందలి వేసములు

అలన్సో (నేపిల్సు రాజు) ఆతని సోదరుఁడు సెబాస్టియను

ప్రోస్పెరో మిలనుకునిజమైనప్రభుఁడు అతనిసోదరుఁడాంటోనియో

మిలను కన్యాయప్రభుఁడు

ఫర్డినందు నేపిల్సురాజుకొడుకు

గొంజాలో వృద్ధుఁడగున్యాయోపదేష్ట

అడ్రియను ఫ్రాన్సిస్కోలుఁ ప్రభువులు

కాలిబను అడవిమనుష్యుఁడును మఱుగుజ్జునగు నొక బానిసీఁడు

ట్రింకూలూ హాస్యగాఁడు

స్టీఫానో త్రాగిన యుగ్రాణపువాఁడు

నౌకాధిపతి

తండేలు

ఓడంగులు

